# శ్రీ ఆంజనేయ చరిత్ర

## (శ్రీ పరాశర సంహితా)

### నవమ పారిజాతము





సమర్పణ:

"వైద్యవిద్వాన్" "భాషాప్రవీణ" "హిందీవిశారద"

శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి, M. A., P. O. L.

ప్రచురణ:

శ్రీ హనుమత్సేవా సమితి

సత్యనారాయణపురం : విజయవాడ - 520 011.

ద్వితీయ ముద్రణ :
శ్రీ కాళయుక్తి - ఆశ్వయుజము
వెల : రు. 5-00



"శ్రీరామ రక్ష - సర్వ జగద్రక్ష"

—: విషయ సూచిక :—



"శ్రీ ఆంజనేయ రక్ష - అఖిల జగద్రక్ష"



ముద్రణ :
"తిరుమల"
విజయవాడ-520002

# పితృ వందనం



ఈ రూపు నీయఁగని నా,
కీ రీతిగ హానుమ నెంచు నింగిత మిదు సీ
తారామాంబా లక్ష్మీ
నారాయణులన్ పితరుల నమములఁ గొలుతున్ ॥

—అన్నదానం చిదంబరశాస్త్రి.

# "మాతృదేవో భవ"

వేదపురాణాదులు సనాతన వాఙ్మయ సంప్రదాయాలు అన్నీ మాతృత్వానికి ఎనలేని విలువనిచ్చాయి. "పితృదేవోభవ" "ఆచార్యదేవోభవ" అనేవానికి ముందే "మాతృదేవోభవ" అని తల్లికి ప్రథమస్థాన మీయబడింది. మనుజునకు తల్లిదండ్రులు, గురువు ప్రత్యక్ష దైవాలు. వారిని సేవించి పూజించి, వారి ఆశీస్సుల నందుకోనక దైవానుగ్రహానికి ప్రాకులాడటం కూడా వ్యర్థమే.

'జనని జనకుఁడు సద్గురుఁ డనలుఁ డాత్మఁ
డనఁగ ని య్యేవురును నేగృహస్థుచేత
సుగతివాంఛఁ బ్రసాదితులగుదు రట్టి
వాఁడ చూవె ధర్మాత్ముండు వసుధమీఁద'

అని మాతాపితృ సంసేవనము వలననే సర్వజ్ఞుఁడై, బ్రాహ్మణోత్తముఁడు కౌశికునకే ధర్మోపదేశ మొనర్చిన కిరాతుఁడు ధర్మవ్యాధుఁడు చెప్పినట్లు దానిని మించిన గృహస్థ కర్తవ్యం లేదు. కాలదేశ స్థితిగతులెట్లు మారినా మారని ధర్మాలలో మాతృసేవ కూడా ఒకటి. మానవమాత్రుల మవటం వల్ల బాల్యంలో అనేక రీతుల వేధించినట్లే గృహవ్యవహారాలలోనూ ఎన్నోరీతుల కష్టపెట్టి ఉన్నా మనస్ఫూర్తిగా క్షమాపార్థన మొనర్చుచు ఆశీస్సుల నందుకోనుటే దోషవిమోచనమునకు మార్గము. ఉత్తమ జన్మనిచ్చి, ఉత్తమ సంస్కారమిచ్చి, సన్మార్గమువైపు నడిపించిన తలిదండ్రుల సేవ కూడా అట్టి ఉత్తమ మార్గంలో చేసుకోవటం

కర్తవ్యం. మన పుణ్యకార్యాలలో వారి ఆశీస్సు లందు కొంటూ వారినీ అందు భాగస్వాములను చేయటం కూడా పితృసంసేవనమే. నా జీవితాశయమైన హనుమత్సేవలో భాగంగా శ్రీ పరాశరసంహితను లోకానికి అందిస్తూ పింగళ నామ సంవత్సర భాద్రపద బహుళ తదియ ది 30-9-77 న మా తండ్రిగారి షష్ట్యబ్ద్యుత్సవ సందర్భంగా సప్తమ పారిజాతం వారి చేతులమీదుగా స్వామి పాదాలకు చేర్చే భాగ్యం కలిగింది. కాళయుక్తి హనుమజ్జయంతి శుభ సందర్భాన అష్టమ పారిజాతాన్ని గురుదేవులు బ్రహ్మశ్రీ పాలపర్తి వేంకట సుబ్బావధాన్లుగారి చేతులమీదుగా స్వామి పాదాలకడ చేర్చే అదృష్టం కలిగింది. ఊహించని రీతిగా వరుసతప్పక నవమపారిజాతము పునర్ముద్రణతో మా తల్లిగారి షష్టిపూర్తి సందర్భంలో వెలువడటం నా అదృష్టము. యీ రుధిరోద్గారి శ్రీ హనుమత్సంవత్సరంలో కార్తీక బహుళ ఏకాదశి ది. 30-11-83 న ఈ నవమ పారిజాతాన్ని మా మాతృమూర్తి చేతులమీదుగా శ్రీ హనుమంతుని పాదములచెంత చేర్చగల్గుట నా ధన్యతగా భావించుచున్నాను. ఈ మహదవకాశమున సహకరించినవారెల్లరకు కృతజ్ఞతలు.

ఇట్లు,

సుజనవిధేయుడు

అన్నదానం చిదంబరశాస్త్రి.

# శ్రీ ఆంజనేయ చరిత్ర

## [శ్రీ పరాశర సంహితా]

### ఏకచత్వారింశత్పటలః-41
### పర్వదివస శ్రీ హనుమత్పూజా కథనం

శ్రీ మైత్రేయః :

శ్లో॥ కీదృశే దివసే మాసే క్షేత్రేవాపి చ కీదృశే ।
భాన్వాది వాసరే యోగే సంపూజ్యో హనుమత్ప్రభుః

తా॥ శ్రీ మైత్రేయులవారడుగుచున్నారు- ఓ పరాశరమునీ! శ్రీ హనుమంతుని ఎటువంటిరోజున, ఏ మాసమునందు, యెట్టి క్షేత్రమునందు, ఆదివారమువంటి ఏ వారమునందు, విష్కంభాది యోగములలో దేనియందు పూజింపవలయునో తెలుపవలసినది.

శ్లో॥ పూజయిత్వా పురా కే వా సంగతాః కీదృశం ఫలం।
తన్మమాచక్ష్వ యోగీంద్ర పరాశర! కృపాంబుధే! ॥

తా॥ పూర్వమారీతిగా పూజించి ఎవరైనా ఫలితము పొందిరా ? యెట్టి ఫలితమును పొందిరి ? ఆ విషయములను దయాసముద్రుడవగు ఓ పరాశరమునీ నాకు చెప్పవలసినది.

శ్రీ పరాశరః :

శ్లో॥ మునే! చిత్రం ప్రవక్ష్యామి గుహ్యాద్గుహ్యతమంమహత్
సర్వలోకోపకారాయ సావధానమనా శ్శృణు ॥

తా॥ శ్రీ పరాశర మహాముని చెప్పుచున్నారు- ఓ మైత్రేయమునీ! అతివిచిత్రము, అత్యంత రహస్యమునగు విష

యమును చెప్పుచున్నాను- సర్వలోకములకు ఉపకారమగు రీతిని సావధానుడవై వినవలసినది. దీని చేతనే శ్రీ పరాశరు లవారీ సంహితా విషయములను కేవలం మైత్రేయునకే కాక లోకమంతటికి చెప్పినట్లు గ్రహించి అనుసరింప దగినదిగా తెలియుచున్నది.

శ్లో॥ చైత్రే పుష్యాఖ్యనక్షత్రే మైందో నామ ద్విజోత్తమః।
భజమానో హనూమంతం అభూ త్పూర్ణ మనోరథః॥

తా॥ చైత్రమాసమందు పుష్యమీనక్షత్రమున మైందుడను బ్రాహ్మణోత్తముడు హనుమంతుని సేవించి సంపూర్ణ మనోరథుడయ్యెను. ఆ గాథ సుందరీ నగరముచు హనుమత్పీఠమునకు చెందినది. అది ముప్పదిమైదవపటలమున అనగా సప్తమ పారిజాతమున కలదు.

శ్లో॥ ఆశ్లేష ఋక్షే వైశాఖే ధ్వజదత్తో మహా ద్విజః।
సంపూజ్య శ్రీహనూమంతం మహదైశ్వర్య మాన వై॥

తా॥ వైశాఖ మాసమందు ఆశ్లేషానక్షత్రమున ధ్వజదత్తుడను బ్రాహ్మణ శ్రేష్ఠుడు హనుమంతుని గొప్పగ పూజించి సకలైశ్వర్యములను పొందెనుకదా! ఆ గాథ నైమిశారణ్యమను హనుమత్పీఠమునకు సంబంధించినది. అది ఎనిమిదవ పటలమునుండి పదునాల్గవ పటలమువరకు కలదు. ఆ భాగము ద్వితీయ, తృతీయ పారిజాతములందు కలదు.

శ్లో॥ వైశాఖే మాసి కృష్ణాయాం దశమ్యాం యవనాశ్వకః।
పూజయిత్వా హనూమంతం అంతే ముక్తిమవాపసః॥

తా॥ వైశాఖమాసమందే కృష్ణపక్షమందలి దశమి తిథి యందు యవనాశ్వుడనునాతడు హనుమంతుని పూజించి జీవితము యొక్క అంతిమ క్షణమున ముక్తిని పొందెను. (వైశాఖ బహుళ దశమియే హనుమంతుడు పుట్టినరోజు. అదే హనుమజ్జయంతి దినము. యవనాశ్వ చరితము కాంభోజ నగరమను హనుమత్పీఠమునకు సంబంధించినది అది ముప్పది యొనిమిదవ పటలమున అనగా అష్టమ పారిజాతమునందు కలదు)

శ్లో॥ జ్యేష్ఠేమాసి మఖాయుక్తే హరిశర్మా ద్విజోత్తమః।
హనుమంతం భజన్నాస్తే నివృత్తాన్యప్రయోజనః॥

తా॥ జ్యేష్ఠ మాసమునందు మఖా నక్షత్రమున హరి శర్మ యను బ్రాహ్మణోత్తముడు ఇతర ప్రయోజనముల నన్నిటిని వీడి హనుమంతునే భజించుచుండెను.

శ్లో॥ తీర్థయాత్రా మటన్ జ్ఞాతుం పరిశ్రాంతః కిలాఽధ్వనా।

తా॥ అట్టి అనన్యభావనతో తీర్థయాత్రలను సేవించుచు ప్రయాణవశమున మిక్కిలి అలసట నందెను.

శ్లో॥ తదా కిరాతవేషేణ - హనూమా న్వ్యాతభావనః।
దదౌ ఫలాని పక్వాని - భక్తాయ హరిశర్మణే॥

తా॥ అప్పుడు సర్వప్రాణికారకుడైన హనుమంతుడు కిరాతవేషములో వచ్చి భక్తుడగు హరిశర్మకు బాగుగా పండిన పండ్లనిచ్చి అనుగ్రహించెను. (ఆ గాథ కుశతర్పణ నగరమను హనుమత్పీఠమునకు సంబంధించినది. అది ఇరువది మూడవ పటలమున అనగా పంచమ పారిజాతమున కలదు.)

శ్లో॥ జ్యేష్ఠశుద్ధ ద్వితీయాయాం గాలో నామ కిరాతకః।
సువర్చలాపతిం ధ్యాత్వా కుష్ఠవ్యాధిం చ తీర్ణవాన్॥

తా॥ జ్యేష్ఠమాసమందలి శుక్లపక్ష విదియనాడు గాలుడను పేరుగల కిరాతకుడు సువర్చలానాధుడగు హనుమంతుని సేవించి కుష్ఠువ్యాధినుండి విముక్తి నందెను. (గాలచరిత్రము నైమిశారణ్య హనుమత్వ్రత చరిత్రమే. అది పదునొకండవ పటలమున అనగా తృతీయ పారిజాతమున కలదు.)

శ్లో॥ జ్యేష్ఠశుద్ధ దశమ్యాం చ సుముఖో హ్యంజనాసుతమ్।
భజమానో హనూమంతం ప్రత్యక్షం తస్య లబ్ధవాన్॥

తా॥ జ్యేష్ఠమాసమందే శుక్లపక్షమున దశమి తిథియందు సుముఖుడను భక్తుడు అంజనాతనయుడగు హనుమంతుని సేవించి హనుమత్ప్రత్యక్షము నందెను. (సుముఖ చరిత్రము శ్రీ భద్రనగర మను హనుమత్వ్రతమునకు సంబంధించినది అది ముప్పదినాల్గవ పటలమున అనగా సప్తమ పారిజాతమున కలదు.)

శ్లో॥ ఆషాఢమాసే రోహిణ్యాం ఇంద్రస్సంపూజ్య మారుతిమ్
జితవా న్వృత్రనామానం అసురం లోకకంటకమ్ ॥

తా॥ ఆషాఢమాసము నందు రోహిణీ నక్షత్రమున ఇంద్రుడు హనుమంతుని గొప్పగ పూజించి లోకమునకు ేడగనున్న వృత్రాసురుని జయించెను.

శ్లో॥ శ్రావణ్యాం పౌర్ణమాస్యాం చ కశ్యపః కేసరీసుతమ్।
సంపూజ్య సకలాభీష్టం అవాప మునిపుంగవ ! ॥

తా॥ ఓ మైత్రేయ మునిశ్రేష్ఠా! శ్రావణమాసము నందు పౌర్ణమినాడు కశ్యపుడను భక్తుడు కేసరీనందనుడగు హనుమంతుని పూజలొనర్చి సమస్తములగు కోరికలను పొందెను. (కశ్యపచరిత్రము బ్రహ్మావర్తపురమను హనుమ త్పీఠమునకు సంబంధించినది. అది ఇరువదిరెండవ పటలమున అనగా పంచమ పారిజాతమున గలదు.)

శ్లో॥ మాసే భాద్రపదేఽశ్విన్యాం నాగకన్యా సుమధ్యమా।
హనుమత్పూజయా శీఘ్రం నాగలోకేశతా మగాత్॥

తా॥ భాద్రపదమాసము నందు అశ్వినీ నక్షత్రమున సౌందర్యవతియగు నాగకన్య హనుమంతుని పూజలొనర్చి క్రూరుడగు రక్తరోమరాక్షసుని బారినుండి రక్షింపబడి శీఘ్రముగ నాగలోకము చేరగల్గెను. (ఈ గాథ నాగకన్యా వృత్తాంత కథనమున ముప్పదిరెండవ పటలమున కలదు. అది సప్తమ పారిజాతమున కలదు )

శ్లో॥ మృగశీర్షాఖ్య తారాయాం ఆశ్వినేమాసి మారుతిమ్।
సంపూజ్య ద్రౌపదీ భక్త్యా ప్రసిద్ధి మతులా మగాత్॥

తా॥ ఆశ్వయుజ మాసమునందు మృగశీర్షా నక్షత్రమున ద్రౌపది భక్తితో హనుమంతుని పూజించి ఎనలేని కీర్తి నందెను.

శ్లో॥ ద్వాదశ్యాం కార్తికేమాసి శుక్లపక్షేతు కుంభజః।
హనుమద్భజనా దేవ చులుకేఽబ్ధిం చకార వై॥

తా॥ కార్తికమాసమున శుక్లపక్షమున ద్వాదశియందు

కుంభసంభవుడగు అగస్త్యుడు హనుమంతుని సేవించుటవల ననే కదా సముద్రమును పుడిసిలి బట్టగల్గెను.

శ్లో॥ మార్గశీర్షే త్రయోదశ్యాం సోమదత్తః కపీశ్వరమ్ ।
హనుమద్భజనే నైవ రాజ్యం పునరవాప్తవాన్ ॥

మార్గశీర్ష మాసమునందలి శుక్ల పక్షమున త్రయోదశి యందు సోమదత్తుడను చంద్రవంశపు రాజు వానరశ్రేష్ఠుడగు హనుమంతుని పూజించి పూర్వము తాను కోల్పోయిన రాజ్యమును తిరిగి పొందెను. (సోమదత్త చరిత్రము మాహిష్మతీ పురమను హనుమత్క్షేత్రమునకు సంబంధించినది. అది నాల్గవ పటలమున అనగా ప్రథమ పారిజాతమున కలదు.)

శ్లో॥ ఉత్తరాయాం సుషేణాఖ్యో గంధర్వః పుష్యమాసకే
ఆంజనేయం సమభ్యర్చ్య గానవిద్యా విచక్షణః ॥

తా॥ పుష్యమాసము నందలి ఉత్తరా నక్షత్రమున సుషేణుడను గంధర్వుడు ఆంజనేయుని గొప్పగా పూజించి గానవిద్యయందు జగత్ప్రసిద్ధుడయ్యెను.

శ్లో॥ మాఘే చార్ద్రాఖ్యనక్షత్రే హనుమంతం భజంస్తతః ।
విభీషణసుతో నీలః సర్వాభీష్టానవాపసః ॥

తా॥ మాఘమాసము నందలి ఆర్ద్రా నక్షత్రమున విభీషణుని కొడుకగు నీలుడు హనుమంతుని పూజించి కోరికల నన్నిటిని పొందగల్గెను. (నీలచరిత్రము ఐదవ పటలమున కలదు. అది ప్రథమ పారిజాతమున నున్నది.)

శ్లో॥ పునర్వస్వాఖ్య నక్షత్రే ఫాల్గుణేమాసి చాంగదః ।
హనుమంతం భజన్ శీఘ్రం యువరాజత్వ మాప్తవాన్ ॥

తా॥ ఫాల్గుణమాసమందు పునర్వసు నక్షత్రమున అంగదుడు హనుమంతుని సేవించి వెంటనే యువరాజ పదమును పొందగల్గెను.

శ్లో॥ ఆదిత్య హస్తానక్షత్రే శౌర్యశాలీ ధనంజయః
హనూమంతం భజ న్కృష్ణం సారథిం కృతవాన్నరిమ్ ॥

తా॥ ఆదివారము హస్తానక్షత్రమున పరాక్రమశాలి యగు నర్జునుడు హనుమంతుని సేవించి శత్రువుల హరింపగల్గు కృష్ణుని సారథిగా పొందెను.

శ్లో॥ మృగశీర్షాఖ్య నక్షత్రే భానువారే వృకోదరః ।
హనూమంతం భజ న్సద్యః జితవా నఖిలానరీన్ ॥

తా॥ ఆదివారమున మృగశీర్షా నక్షత్రమున భీముడు హనుమంతుని పూజించి శీఘ్రముగ శత్రువుల నందరను జయింపగల్గెను.

శ్లో॥ పూర్వాభాద్రాఖ్య నక్షత్రే పుష్కరో వానరేశ్వరః
భజ న్లోకే మహాఖ్యాతిం తపస్సిద్ధి మవాప సః ॥

తా॥ పూర్వాభాద్రా నక్షత్రమున పుష్కరుడను పేరుగల వానరాధిపుడు హనుమంతు నర్చించి గొప్ప కీర్తిని, తపస్సిద్ధిని పొందగల్గెను.

శ్లో॥ సతతం మందవారేషు భరతః క్షత్రియోత్తమః ।
హనూమంతం భజన్ తస్థౌ నిరంకుశ పరాక్రమః ॥

తా॥ ప్రతి శనివారము రాజశ్రేష్ఠుడగు భరతుడు

హనుమంతుని పూజించి ఎదురులేని పరాక్రమము కలవాడై యుండెను.

శ్లో॥ ప్రతి వైధృతియోగేషు సంపూజ్య పవనాత్మజమ్ ।
లేభే దృఢాం తపస్సిద్ధిం దూర్వాసో మునిపుంగవః ॥

తా॥ ప్రతి వైధృతియోగమునందును. మునిశ్రేష్ఠుడగు దూర్వాసుడు వాయునందనుడగు హనుమంతుని పూజించుచు దృఢమగు తపస్సిద్ధిని పొందగల్గెను.

శ్లో॥ అమాయుక్తేందువారే చ హనూమద్భజనాత్కిల ।
తారయాసంగతశ్శ్రీమాన్ సుగ్రీవో విగతవ్యథః ॥

తా॥ అమావాస్యతో కూడిన సోమవారమందు శ్రీ హనుమంతుని పూజించుటవలననే సుగ్రీవుడు బాధలన్నియు తొలగినవాడై తారను పొందగల్గెను.

శ్లో॥ భౌమవారే హనూమంతం సీతా సంపూజ్య యత్నతః।
గతవ్యథా మనోవాంఛాసిద్ధిం శీఘ్రమవాప సా ॥

తా॥ మంగళవారము ప్రయత్నపూర్వకముగ హనుమంతుని పూజించుటవలననే సీతాదేవి కష్టముల నన్నిటిని పోగొట్టుకొని శీఘ్రమే మనోవాంఛా సిద్ధి నందగల్గెను.

శ్లో॥ తస్మాదుక్తేషు కాలేషు మైత్రేయ మునిసత్తమ ।
భజస్వ వాయుపుత్రం త్వం సర్వాభీష్ట మవాప్స్యసి ॥

తా॥ కావున ఓ మునిశ్రేష్ఠా! మైత్రేయా! పైన చెప్పిన సమయములందు నీవును వాయునందనుడగు శ్రీ హను

మంతుని సేవించుము. సమస్తములగు కోర్కెలను పొందగలవు.

శ్లో॥ య ఇదం హనుమత్సూక్తం కీర్తయేచ్ఛృణుయాదపి ।
సోఽపి కామా నవాప్నోతి నాత్ర కార్యా విచారణా॥

తా॥ ఈ చెప్పబోవు హనుమత్సూక్తము నెవ్వారు పఠింతురో, లేదా విందురో వారును అభీష్టము లన్నిటిని పొందగల్గుదురు. ఇందు సంశయింపవలసిన పనిలేదు.

## శ్రీ హనుమ త్సూక్తమ్

శ్రీమన్తః సర్వాలక్షణ సంపన్నః జయప్రదః సర్వాభరణ భూషిత ముదారం మహోన్నతోష్ట్రి ఘారూఢః కేసరీప్రియనందనః వాయుతనూజః యథేచ్ఛపంపాతీరవిహారః గంధమాదన సంచారః హేమ ప్రాకారాంచిత కదళీ వనాంతరనివాసః పరమాత్మా వనచరశాపనిమోచనః హేమవర్ణాం నానారత్నఖచితా మమూల్యాతరాం మేఖలాం చ స్వర్ణోపవీతాం కౌశేయవస్త్రం చ బిభ్రాణః సనాతనః పరమ పురుషః మహాబలః అప్రమేయప్రతాపశాలీ రజిత వర్ణః శుద్ధస్ఫటికసంకాశః, పంచవదనః పంచదశనేత్రః సకల దివ్యాస్త్రధారీ శ్రీ సువర్చలారమణః మహేంద్రా ద్యష్ట దిక్పాలక త్రయస్త్రింశద్గీర్వాణ ముని గణ గంధర్వ యక్ష కిన్నర పన్నగాసుర పూజిత పాద పద్మయుగళః నానావర్ణః కామరూపః కామచారః యోగిధ్యేయః శ్రీ హనుమాన్

ఆంజనేయో విరాడ్రూపీ విశ్వాత్మా విశ్వరూపః పవన నందనః పార్వతీపుత్రః ఈశ్వర తనూజః సకల మనోరథా న్నోదదాతు.

వ॥ ఇదం శ్రీ హనుమత్స్తోత్రం యో ధీమాన్యేకవారం పఠే
ద్యది సర్వేభ్యః పాపేభ్యో విముక్తో భూయాత్.

తా॥ ఈ శ్రీ హనుమత్స్తోత్రమును బుద్ధిమంతుడనే వాడు ఒక్కమారుగాని, పఠించిన యెడల ఆతడు సమస్తము లగు పాపములనుండి విముక్తుడగును.

వ॥ ద్వివారం యది పఠేత్ సమస్త తీర్థస్నానః సర్వ
వేదాంగపారగశ్చ భూయాత్.

తా॥ పై శ్రీ హనుమత్స్తోత్రమును రెండుమార్లు పఠించిన యెడల సమస్త పుణ్యతీర్థములందును స్నానమాడిన పుణ్యమందును. వేదాంగముల నన్నిటిని పూర్తిగ నెఱిగిన ఫల మందును. వేదాంగములనగా శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిశ్శాస్త్రము, కల్పశాస్త్రము అను నారు.

వ॥ ఇదం త్రివారం యః పఠేత్ శ్రీ హనుమత్సాయుజ్యం
ప్రాప్నుయాత్ సర్వాన్కామా నవాప్నోతి.

తా॥ ఈ శ్రీ హనుమత్స్తోత్రము నెవరు మూడు మారులు పఠింతురో వారు ఐహికములగు కోరికలనన్నిటిని పొంది చివఱకు హనుమత్సాయుజ్యము నందుదురు. అనగా హనుమంతునిలో లీనమగుదురు.

శ్లో॥ ఏషు పర్వదినే ష్వేవం సంపూజ్య కపిశేఖరం
తథా ద్వాదశవారం తు జుహుయా ద్గోఘృతేన చ॥

తా॥ ఈ పర్వదినములందు వానరశ్రేష్ఠుండగు హనుమంతు నర్చించి ఆవునేతితో పండ్రెండు పర్యాయములు హోమము నాచరింపవలెను

శ్లో॥ యథాశక్తి బ్రాహ్మణాం శ్చ భోజయే దిష్టవస్తుభిః
ఆంజనేయ ప్రసాదేన సర్వా న్కామా నవాప్నుయాత్ ॥

తా॥ హోమానంతరము అన్న సమారాధన మొనర్చవలెను. శక్తి కొలది ఇష్టవస్తువులతో ఉత్తములగు బ్రాహ్మణులకు భోజనము యేర్పరుపవలెను. ఈ రీతిగ చేసిన శ్రీ ఆంజనేయుని అనుగ్రహమున సమస్తములగు అభీష్టములను పొందగలడు.

శ్లో॥ అన్య ద్రహస్యం వక్ష్యామి శ్రుణుష్వ మునిపుంగవ।
వైశాఖేమాసి కృష్ణాయాం జయంత్యాం దశమీతిథౌ॥

తా॥ ఓ మునిశ్రేష్ఠా! మైత్రేయా! మఱియొక రహస్యవిషయమును తెల్పెదను వినవలసినది. వైశాఖ మాసమునందు కృష్ణపక్షమున దశమి తిథియందు అనగా హనుమజ్జయంతి దినమున—

శ్లో॥ యథాశక్తి సువర్ణేన తామ్రేణ రజతేన వా
హనుమద్విగ్రహం ధీమాన్ కారయిత్వా ప్రయత్నతః॥

తా। శక్తి ననుసరించి బంగారముతోగాని, రాగితోగాని, వెండితోగాని బుద్ధిమంతుడగువాడు ప్రయత్నపూర్వకముగా హనుమంతుని విగ్రహమును చేయించి—

శ్లో॥ బ్రాహ్మణాయ సుశీలాయ దానంకుర్యా త్కుటుంబినే
జయంతి దివసే పూజాం కృత్వా హనుమతః ప్రభోః ॥

తా॥ హనుమజ్జయంతి దినమున స్వామియగు హనుమంతుని పూజ నొనర్చి సౌశీల్యవంతుడు, కుటుంబీకుడు అగు సద్బ్రాహ్మణునకు ఆ విగ్రహమును దానమొనర్చవలెను.

శ్లో॥ ఉపవాసో యతేః ప్రోక్తః గృహీణాం భోజనం మతమ్
పూర్వా ప్రోష్ఠపదాయుక్తా జయంతీ దశమీతిథిః ॥

తా॥ శ్రీ హనుమజ్జయంతి దినమున యతులకు ఉపవాసనియమము చెప్పబడినది. గృహస్థులు భోజనము చేయు వచ్చును. వైశాఖమున దశమీ తిథి పూర్వాభాద్ర నక్షత్రముతో కూడినది జయంతిగా తెలియదగును.

శ్లో॥ తత్ర నక్షత్రవైరూప్యే తిథిరేవ ప్రయోజికః
వైశాఖేమాసి యత్నేన కుర్యా ద్ధర్మ మనుత్తమమ్ ॥

తా॥ జయంతి విషయమున తిథి, నక్షత్రములకు సంబంధము కుదరకున్నచో దశమి తిథినే ప్రధానముగా పరిగణించవలెను. వైశాఖమాసమున శ్రేష్ఠమగు ఈ హనుమద్వ్రత ధర్మము నాచరింపవలెను.

శ్లో॥ అసకృద్వా సకృద్వాపి పరాంగతి మవాప్నుయాత్ ॥

తా॥ ఎప్పుడూ పై జయంతి వ్రతము నాచరించినను ఎప్పుడైన నొకప్పు డాచరించినను ఉత్తమ గతిని పొందగలుదురు.

శ్లో॥ వైశాఖమాస మాహాత్మ్యం కల్పకోటిశతై రపి
న శక్యం వర్ణితుం బ్రహ్మన్ బ్రహ్మణాపి సమం తతః ॥

ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! మైత్రేయా!

తా॥ వైశాఖమాస మాహాత్మ్యమును శతకోటి కల్పములయందైన వర్ణించుటకు బ్రహ్మకు కూడ శక్యముకాదు.

శ్లో॥ సువర్చలాపతి శ్శ్రీమాన్ అంజనాగర్భ సంభవః
హనుమా న్మారుతి శ్శ్రీమాన్ అవతీర్ణోఽరిశిక్షకః ॥

తా॥ వైశాఖమాసమునందు సంపత్సహితుడగునట్టి, సువర్చలాపతియైనట్టి, అంజనాదేవికి కుమారుడు, వాయునందనుడు, శత్రుశిక్షకుడు అయిన హనుమంతుడే ఈ లోకమున అవతరించెను.

శ్లో॥ తదాప్రభృతి మాసస్య వైశాఖస్య మహాత్మనః
స్నానదానాది యోగ్యత్వం హనుమజ్జన్మకారణాత్ ।

తా॥ అట్లు హనుమంతుడు జన్మించిన కారణమున అప్పటినుండియు గొప్పదగు వైశాఖమాసమునకు స్నానదానాదికమగు యోగ్యత సిద్ధించినది.

శ్లో॥ ఇతి నిశ్చిత్య మతిమాన్ స్నాయా ద్బాహ్యజలాంతరే
సంతర్పయేత్పితౄంస్తత్ర దద్యా ద్విప్రాయ గాం ధనమ్॥

తా॥ అని బుద్ధిశాలియగువాడు గుర్తించి ఆ మాసమున నదీ తటాకాది బాహ్య జలములందు స్నాన మొనర్చవలెను. అచ్చటనే పితృదేవతలకు తర్పణలువిడచి విప్రునకు గోదాన, ధనదానాదు లొనర్చవలెను.

శ్లో॥ దాపయే దుదకం చాన్నం హనుమత్ప్రీతయే తథా

తా॥ హనుమత్ప్రీత్యర్థము శ్లో॥ ఉదక దాన, అన్న దానము లొనర్చవలెను.

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వాపి వైశ్యోవా శూద్రపవవా
స్త్రియః పుమా న్నపుంసకోవా యథాశక్తి నివేదయేత్॥

తా॥ బ్రాహ్మణుడైన, క్షత్రియుడైన, వైశ్యుడైన, శూద్రుడైన, స్త్రీలు, పురుషులు, చివరకు నపుంసకుడయి నను యథాశక్తి నివేదన మొనర్చవలెను.

శ్లో॥ తతస్తు హనుమా న్ప్రీతః దద్యా న్నిజపదాంతికమ్
భానువారే శ్వేతసంజ్ఞీ నాదా యాత్ర్రయత్నతః॥

తా॥ అట్లు చేసినచో హనుమంతుడు సంప్రీతుడై తన పదసాన్నిధ్యమున చేర్చుకొనును. ఆదివారమునాడు మిక్కిలి జాగరూకుడై తెల్లగురువింద గింజలను తెచ్చి,

శ్లో॥ సప్తమంత్రాత్మికాంవిద్యాం ఉచ్చరే చ్ఛ్రీహనూమతః
భూమా ఖనిత్వా మంత్రేణ భానువారే వినిక్షిపేత్॥

తా॥ వానితో శ్రీ హనుమంతుని సప్తమంత్రాత్మక విద్యను జపించి మంత్రోచ్చారణ మొనర్చుచునే భూమిని త్రవ్వి ఆదివారమునందా విత్తనములను భూమియందుంచ వలెను.

శ్లో॥ ఇమం మంత్రం పఠ న్బీజ మూలం తోయేన సేచయేత్
ఫలితం కారయే త్సమ్య గేవం గుంజావనీరుహామ్॥

తా॥ ఈ మంత్రమునే పఠించుచు జలముతో బీజముల

మూలభాగమును తడపవలెను. ఇట్లు గురువిందతీగె ఏర్పడు వరకు అట్లు జలసేచన మొనర్చుచుండవలెను.

శ్లో॥ అనంతరం భానువారే సప్త మంత్రాత్మకం మనుమ్
శుచిర్భూత్వా పఠన్ శ్వేత గుంజామూలం చ సంగ్రహేత్ ॥
తా॥ తరువాత ఆదివారమునాడు సప్తమంత్రాత్మక మగు హనుమద్విద్యను శుచియై పఠించుచు ఆ గురువింద మూలమును తీయవలెను.

శ్లో॥ హస్తే నిక్షిప్య తన్మూలం సప్త మంత్రాత్మకం మనుం
అష్టోత్తరశతం జప్త్వా ఉపచారైః ప్రపూజయేత్ ॥
తా॥ ఆ మూలమును హస్తమునం దుంచుకొని సప్త మంత్రాత్మక మనువును నూటయెనిమిది పర్యాయములు జపించి షోడశోపచారములతో చక్కగ పూజింపవలెను.

శ్లో॥ తతో ద్వాదశవారం తు జుహుయాత్ గోఘృతేన చ
భూసురాన్పంచసంఖ్యాకాన్ యథేష్టం భోజయేద్బుధః॥
తా॥ తరువాత ఆవునేతితో పండ్రెండు మారులు హోమము చేయవలెను. అటుపిమ్మట ఐదుగురు బ్రాహ్మణులకు ఇష్టములగు పదార్థములతో యజమాని యగువాడు సమారాధన మొనర్చవలెను.

శ్లో॥ ఏవం కృతేఽపి తన్మూలం హనుమత్సమతాం వ్రజేత్
ప్రతివర్షం తు తన్మూలం సర్వకాలేషు పూజయేత్ ॥
తా॥ ఈ రీతిగ చేయుటవలన ఆ గురువిందమూలము

కూడ హనుమంతునితో సమానమైనదగును. ప్రతి సంవత్సరము ఆ మూలమును అన్ని వేళలయందు పూజింపవలెను.

శ్లో॥ అనంతరం చ తన్మూలం ధారయే ద్యఃపుమా న్శుచిః
తస్య సందర్శనా దేవ సర్వలోకవశం భవేత్ ॥

తా॥ అనంతర మా మూలమును ఎవడైతే పరిశుద్ధుడై ధరించునో వానికి ఒక్కమారు చూచుటవలననే లోకమంతయు వశమగును.

శ్లో॥ అపరోఽపి విశేషోఽస్తి సర్వ సంపత్ప్రదాయకః
స్నేహా న్మైత్రేయ నూనం తే గద్యతే గోప్యతామయమ్॥

తా॥ సమస్త సంపదలను చేకూర్చగలునట్టి వేఱొక విశేషాంశమున్నది. అది నిజముగ మిక్కిలి రహస్య విషయమే. కాని ఓ మైత్రేయా! నీ యందలి ప్రేమచే చెప్పుచున్నాను వినవలసినది.

—: శరావోదయ వ్రతలక్షణం :—

శ్లో॥ అరుణోదయ మారభ్య తస్య చాస్తమయావధి
శరావఘృత పక్వానాం అపూపానాం హనూమతే
నివేదితానాం విప్రేభ్యః శ్రోత్రియేభ్య స్సమర్పణాత్
శరావోదయనా మైవం- వ్రతానాం ఉత్తమం వ్రతమ్॥

తా॥ అరుణోదయము మొదలుకొని ఆ రోజు సూర్యాస్తమయము వరకు మూకుడునందు నేతితో వండిన అప్పములను హనుమంతునకు నివేదన మొనర్చి శ్రోత్రియులగు బ్రాహ్మణులకు సమర్పింపవలెను. ఇది శరావోదయ

మను పేరుగల వ్రతము. వ్రతము లన్నింటియందును శ్రేష్ఠ
మైన వ్రతము.

శ్లో॥ మృకండుమునినా చీర్ణం పురా బదరికాశ్రమే
మార్కండేయో మహాయోగీ చిరంజీవీ జితేంద్రియః
పుత్రో ల్బ్ధో మహాయోగీ - సర్వాలోకేషు విశ్రుతః ॥

తా॥ పూర్వము బదరికాశ్రమమున మృకండుమునిచే
ఈ వ్రతము చేయబడినది. ఆ మహాముని వ్రతము చేసి మహా
యోగియు, చిరంజీవియు, ఇంద్రియ నిగ్రహుడును అగు
మార్కండేయుని పుత్రునిగా పొంది సర్వలోకములందును
కీర్తి నందెను.

ఇదం వ్రతం మహాపుణ్యం సర్వకామ ఫలప్రదమ్ ।

తా॥ ఈ వ్రతము మిక్కిలి పుణ్యప్రదమైనది, అన్ని
కోర్కెలను తీర్చునట్టిదియు-

శ్లో॥ యస్య కార్యస్య సంసిద్ధి రిష్యతే సర్వజంతుభిః
అవాప్యతే హి సా శీఘ్రం మితరోపాయ దుర్లభా ॥

తా॥ సర్వ ప్రాణులచేతను ఏ కార్యముయొక్క సిద్ధి
కోరబడుచున్నదో అట్టిది ఇతరోపాయములచే పొందలేనిది
కూడ ఈ వ్రతముచే పొందబడుచున్నది.

శ్లో॥ నాస్తికాయ కృతఘ్నాయ - దాంభికాయ దురాత్మనే
కదాచి దపి నో విప్ర! రహస్యం న దిశే త్సుధీః ॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! మైత్రేయా! రహస్యమగు దీనిని నాస్తికునకు, చేసిన మేలు మరచువానికి, దంభ గుణము కలవానికి, దుర్మార్గునకు, ఎప్పుడును యోగ్యుడగు వాడు చెప్పరాదు.

ఇతి గదిత హనూమద్భక్త సంఘప్రభావం
సకల భువన రక్షాకృత్యదక్షం మునీంద్రమ్
సపది సమభి సద్యః స్తోత్రరూపేణ భూయః
ప్రవద ద్ధనుమద్విద్యా మిత్యవోచ త్కథాం సః ॥

తా॥ ఇట్లు చెప్పబడిన హనుమద్భక్తుల ప్రభావము కల్గినట్టి, సమస్త లోకముల రక్షణయందు సమర్థుడగు హనుమత్కార్యమున నిపుణుడగు శ్రీ పరాశర మునీంద్రు నప్పుడు మైత్రేయుడు స్తోత్రముల రూపమున మిక్కిలి పొగిడెను. శ్రీ పరాశరుడును హనుమద్విద్యకు సంబంధించిన గాథను చెప్పదొడగెను. (నాల్గవ పాదమున ఛందోభంగము కానవచ్చుచున్నది.)

ఇతి శ్రీ పరాశర సంహితాయాం శ్రీ పంచముఖ హనుమన్మంత్ర వివరణే పర్వదివసస్య శ్రీ హనుమత్పూజా కథనం నామ ఏకచత్వారింశత్పటలః

—♦—

## ద్విచత్వారింశత్పటలః
## వీరహనుమన్మాలామంత్ర ప్రభావ కథనం

శ్రీ మైత్రేయః 

శ్లో॥ పరాశర మహాప్రాజ్ఞ! సర్వమంత్ర విశారద !
వదస్వ వీరహనుమ -న్మాలామంత్రం విశారద ॥

తా॥ శ్రీ మైత్రేయముని అడుగుచున్నారు- ఓ సర్వజ్ఞుడగువాడా ! అన్ని మంత్రము లెరిగినవాడా ! పరాశరమునీ శ్రీ హనుమన్మాలా మంత్రమును చెప్పవలసినది.



శ్రీ పరాశరః-

శ్లో॥ జ్ఞానే విరాగే హరిభక్తిభావే
ధృతస్థితి ప్రాణబలేషు యోగే
బుధ్ధా చ నాన్యః హనుమత్సమానః
పుమాన్ కదాచిత్క్వచ కశ్చనైవ ॥



తా॥ శ్రీ పరాశర మహాముని చెప్పుచున్నారు. ఓ మైత్రేయా ! జ్ఞానమునందును, వైరాగ్యభావమునందును, భక్తిభావమునందును ధైర్యమునందును, స్థయిర్యమునందును, ఆయువునందును, బలమునందును, చిత్తవృత్తి నిరోధము నందును, పాండిత్యమునందును హనుమంతునితో సమానుడగువాడు ఎక్కడను ఎప్పుడును ఎవడును లేడు.

శ్లో॥ శైవానాం పరమశ్శైవో వైష్ణవానాం ప్రధానతః
ఇతి మత్వా హనూమంతం మునయ స్సముపాశ్రితాః

తా॥ శైవులగు వారలకు ముఖ్యుడగు శివుడని, వైష్ణవులగు వారికి ముఖ్యుడగు వైష్ణవుడని తలచబడుచు శ్రీ హనుమంతుడు మునులందఱకు ఆశ్రయుడగుచున్నాడు.

శ్లో॥ మంత్రోద్ధారం ప్రవక్ష్యామి మంత్ర మాహాత్మ్య మేవ చ
మైత్రేయ! మునిశార్దూల! శృణు ష్వానన్యమానసః ॥

తా॥ మునులలో శ్రేష్ఠుడవగు ఓ మైత్రేయ మహాముని! హనుమంతుని మంత్రోద్ధార విధానమును, మంత్ర మాహాత్మ్యమును చెప్పుచున్నాను. ఇతరమున మనము నుంచక వినుము.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య నమోభగవతే పదం
వీరప్రతాప విజయ హనుమత్పద ముచ్యతే ॥

తా॥ ముందుగ ప్రణవమగు ఓం అను పదము నుచ్చరించి పిదప, నమోభగవతే, యని, పిదప వీరప్రతాప విజయ హనుమతే, అనవలెను.

శ్లో॥ స్తంభినీ, మోహినీ వశీకరణి పద ముచ్చరేత్
తతో విద్వేషణీ చైవ మారణీ పద ముచ్చరేత్ ॥

తా॥ స్తంభినీ మోహినీ వశీకరణీపదము లుచ్చరింపవలెను. పిదప విద్వేషిణీ అను పదమును, మారిణీ అను పదమును ఉచ్చరింపవలెను.

శ్లో॥ తతశ్చ పంచీకరణి తథా నామపదం వదేత్
తతో వై బంధనబలా ముఖబంధన చా ప్యథ ॥

తా॥ పిదప పంచీకరణీపదమును, అటులనే నామపదము

పిదప బంధన బలపదమును, ఆ పై ముఖబంధన పదమును ఉచ్చరింపవలెను.

శ్లో॥ తతః పరం గ్రామముఖ బంధనేతి పదం తతః
నారీ ముఖపదం చైవ బంధనేతి పదం తతః !

తా॥ పిమ్మట గ్రామ ముఖబంధన అను పదమును, ఆపైన నారీ ముఖపదమును పిమ్మట బంధన పదమును ఉచ్చరింపవలెను.

శ్లో॥ మకర చౌపష్టి పదం బంధనేతి సముచ్చరేత్
సింహ వ్యాఘ్ర వరాహేతి తతో వై సర్పవృశ్చిక ॥

తా॥ మకర చౌపష్టిపదమును పల్కి పిదప బంధనపదము నుచ్చరింపవలెను. సింహ వ్యాఘ్ర వరాహపదములు పల్కి పిదప సర్పవృశ్చిక పదములను పలుకవలెను.

శ్లో॥ భూత చోరాగ్ని బాధా చ పాషాణపద ముచ్చరేత్
నిర్ఘాత పద ముచ్చార్య సర్వవైరిముఖం తథా ॥

తా॥ భూత చోరాగ్ని బాధా అని పిదప పాషాణ పదము నుచ్చరింపవలెను. నిర్ఘాత పదము నుచ్చరించి పిదప సర్వవైరి ముఖం అనవలెను.

శ్లో॥ బంధనేతి తతోచ్చార్య కుంజరేతి పదం వదేత్
తతో వృషభ మహిష భల్లూకముఖ బంధనమ్ ॥

తా॥ బంధనపదము నుచ్చరించి కుంజర అను పదమును పలుకవలెను. పిదప వృషభ మహిష భల్లూక ముఖ బంధన పదము నుచ్చరింపవలెను.

శ్లో॥ చాపరే వీరశబ్దశ్చ హనుమత్పద ముచ్చరేత్
అథేశ్వరస్వరూపేతి తథా వై వాయునందనః॥

తా॥ పిదప వీరశబ్దమును, హనుమత్పదమును ఉచ్చరింపవలెను. పిమ్మట ఈశ్వర స్వరూప పదమునుంచి ఆపైన వాయునందన పదము చెప్పవలెను.

శ్లో॥ అథాంజనాసుతే త్యుక్త్వా పాతు పాతు పదం వదేత్
బాంధవవిక్రమ పదం శ్రీవర్ణం చ సముచ్చరేత్॥

తా॥ పిమ్మట అంజనాసుత అను పదము నుచ్చరించి పాతు పాతు పదమును పల్కవలెను. బాంధవ విక్రమపదమును పల్కి పిదప శ్రీవర్ణము నుచ్చరింపవలెను.

శ్లో॥ రామదూతపదం చైవ శత్రువిధ్వంసనంపదం
తతో మహాభైరవేతి తతః శత్రుక్షయాయ చ ॥

తా॥ పిమ్మట రామదూత పదము నుచ్చరించి శత్రువిధ్వంసన పదము చెప్పిన తరువాత మహాభైరవ అని ఆ పిదప శత్రుక్షయాయ అని చెప్పవలెను.

శ్లో॥ ప్రణవం చ తతోచ్చార్య హ్రాం హ్రీం హ్రూం ఏహి ఏహి చ
తతో వై సర్వవిషయే సర్వజన పదం తతః॥

తా॥ పిమ్మట ఓంకారము నుచ్చరించి హ్రాం హ్రీం హ్రూం ఏహి ఏహి అని పల్కి పిదప సర్వవిషయే సర్వజన పదము ననవలెను.

శ్లో॥ వశీకరణేతి పదం పశ్చాత్పరబలం తతః
ఖాదయేతి ద్విరుచ్చార్య పశ్చాత్ మమ పదం తతః॥

తా॥ వశీకరణ అను పదము ను, పిమ్మట పరబలం అను పదమును. ఆపైన ఖాదయ ఖాదయ అని రెండు మార్లును పలికిన వెనుక మమ పదము నవలెను.

శ్లో॥ సర్వకార్యాణి పదం చోక్త్వా సాధయేతి ద్వి రుచ్చరేత్
మమ శత్రుక్షయం చైవ కురు కుర్వితి సంవదేత్ ॥

తా॥ సర్వకార్యాణి అను పదమును పల్కి సాధయ సాధయ అని రెండుమార్లు పలుకవలెను. మమ శత్రుక్షయం అని పల్కిన పిదప కురుకురు అని పలుకవలెను.

శ్లో॥ ప్రణవం చ తతో చ్చార్య హ్రాం హ్రీం హ్రూం పదముచ్చరేత్
వరాహబీజ ముచ్చార్య ఫట్ స్వాహా పదం వదేత్ ॥

తా॥ పిమ్మట ఓంకారము నుచ్చరించి హ్రాం హ్రీం హ్రూం అను బీజాక్షరముల నుచ్చరింపవలెను. తరువాత వరాహబీజమగు 'హుం' అను దానిపై ఫట్ స్వాహా అని చెప్పవలెను.

శ్లో॥ వర్ణానాం చ షట్పంచాశ దుత్తర శతద్వయం
సర్వమంత్రేష్వయం మంత్రం శ్రేష్ఠ ఇత్యుచ్యతేబుధైః ॥

తా॥ ఈ మంత్రమునందు వర్ణములు రెండువందల యేబదియారుండును. ఈ మంత్ర మన్ని మంత్రములలోను శ్రేష్ఠమైనదిగా పండితులచే చెప్పబడుచున్నది. మంత్రము నుచ్చరించవలసిన వర్ణములకు వలయు విభక్తులతోనే వర్ణ సంఖ్య యుండును. మూలమంత్రమును గురుముఖముననే పొందనగును.

శ్లో॥ మంత్రస్యాస్య పునశ్చర్యా హోమ స్తర్పణ మేవ చ
ప్రతాప హనుమన్మాలా మంత్రవ ద్వక్ష్యతే మునే ॥

తా॥ ఈ మంత్రమునకు సంబంధించిన పునశ్చర్యా విధానమును, హోమ విధానమును తర్పణ విధానమును, ప్రతాప హనుమన్మాలా మంత్రమువలెనే చెప్పబడుచున్నది.

ధ్యానమ్—

శ్లో॥ ఉద్యన్మార్తాండకోటి ప్రకటరుచికరం చారు వీరాసనస్థం
బిభ్రాణం హేమమౌంజీంకరధృతకమలంనాగయజ్ఞోపవీతం
ధీరంసర్పేందుమౌళివరమణి మకుటం కుండలాభాసగండం
భీమాకారం త్రినేత్రం మమ శుభఫలదం
వాయుపుత్రం నమామి ॥

తా॥ పై మంత్రమున కిది ధ్యానశ్లోకము. ఉదయించుచున్న కోటి సూర్యులవంటి కాంతిగలవాడును, అందముగ వీరాసనమందు ఉన్నవాడును, బంగారు ముంజ మేఖల కలవాడును, చేతియందు ధరించిన కమలము, సర్పముతో నొనర్చబడిన యజ్ఞోపవీతము కలవాడును, ధీరుడైన వాడును, సర్పము, చంద్రుడు శిరస్సున కలవాడును, శ్రేష్ఠమగు మణులు పొదిగిన కిరీటము కలవాడును, కుండలములచే ప్రకాశించు చెక్కిళ్ళు కలవాడును, భయంకరమగు ఆకారము కలవాడును, మూడు నేత్రములు కలవాడును, నాకు శుభములగు ఫలముల నిచ్చువాడును అగు వాయునందనునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఋషిర్బ్రహ్మనో రీశ్వర శ్చ త్వష్టు ప్ఛందః ప్రకీర్తితః
కాలాగ్ని రుద్ర శ్రీమాన్ హనుమాన్ దేవతా భవేత్॥

తా॥ ఈ మంత్రమునకు ఈశ్వరుడు ఋషి, త్రిష్టు ప్ఛందముగా చెప్పబడెను. కాలాగ్ని రుద్రశ్రీ హనుమాన్ దేవత.

శ్లో॥ ప్రణవం బీజ మిత్యుక్తం స్వాహా శక్తిః ప్రవక్ష్యతే
హనుమాన్ కీలకం చైవ మమ సర్వాభీష్టసిద్ధయే
జపే పదం సముచ్చార్య వినియోగ స్తతఃపరమ్ ॥

తా॥ ఓం బీజం, స్వాహాశక్తిః, హనుమాన్ కీలకం, మమ సర్వాభీష్ట సిద్ధయే జపే వినియోగః అని ఇట్లు చెప్పు కొనవలెను.

శ్లో॥ క్రమశో మూలమంత్రేణ షడంగన్యాస మాచరేత్
అత్రైవ చోదాహరణ మితిహాసం పురాతనమ్ ॥

తా॥ క్రమముగా మూలమంత్రముతో షడంగన్యాస మాచరింపవలెను. ఈ విషయముననే ఉదాహరణముగా ప్రాచీనమగు ఇతిహాసము కలదు.

శ్లో॥ యశస్యం స్వర్గదం నౄణాం అపవర్గ ఫలప్రదం
యస్య శ్రవణమాత్రేణ సద్య స్సుఖ మవాప్నుయాత్ ॥

తా॥ అది నరులకు కీర్తిని, స్వర్గమును, మోక్షమును కూడ ప్రసాదించునది. ఆ ఇతిహాసము వినుటమాత్రముననే వెంటనే జనులు సుఖమందెదరు.

శ్లో॥ యుధి రామో దశగ్రీవం హత్వాऽనంత బలాన్వితం
జానకీ సహిత శ్శ్రీమాన్ సుగ్రీవాది ప్లవంగమైః ॥

తా॥ శ్రీరాముడు యుద్ధమునందు అంతులేని బలము కల రావణుని చంపి జానకితోడను, సుగ్రీవుడు మున్నగు వానరులతో కూడినవాడై-

శ్లో॥ విభీషణాది దనుజైః సుర బ్రహ్మర్షిభి స్సహ
పుష్పకం త త్సమారుహ్య నభోమార్గేణ సత్వరమ్ ॥

తా॥ విభీషణుడు మున్నగు రాక్షసులతోను, దేవర్షులు, బ్రహ్మర్షులతోడను కూడి పుష్పకవిమానము నెక్కి శీఘ్రముగా ఆకాశమార్గమున

శ్లో॥ అయోధ్యానగరం ప్రాప్య సుచిరం సుమహోదయః
కదాచి ద్రాఘవో దృష్ట్వా హనుమంతం మహాబలమ్
ప్రతాపశాలినం వీరం కపివర్య మువాచః ॥

తా॥ అయోధ్యానగరము చేరి ఒకప్పుడు మహామహుడగు రఘురాముడు మహాబలవంతుడు, ప్రతాపశాలి, వీరుడు, కపిశ్రేష్ఠుడు అగు హనుమంతునితో నిట్లు పలికెను:

శ్లో॥ హనుమన్ బుద్ధిసంపన్న మహాబలపరాక్రమ
భవదీయోపకారాణాం హృదయే పరిధావతామ్ ॥

తా॥ బుద్ధి సంపద కల్గినవాడా! గొప్ప బలపరాక్రమములు కలవాడా! ఓ హనుమంతా! నా హృదయమున సందావరించియున్న నీ వొనర్చిన ఉపకారములు-

శ్లో॥ దుష్కరాణాం విరించాద్యైఃమాదృశానాం తు కిం పునః
కం వా ప్రత్యుపకారం తే కః స్యా మ్యధునా సఖే ॥

తా॥ బ్రహ్మాదులకే దుష్కరములైనవి, మావంటి వారికి చెప్పనదేమి? ఓ చెలికాడా! ఇప్పుడు దానికి నేనే ప్రత్యుపకారము నీకు చేయుదును.

శ్లో॥ ప్రథమం దుర్గమే రమ్యే సీతా విరహకాతరః ।
కతికర్తవ్యతామూఢః సీతాధ్యానపరాయణః ।
అహం మమానుజశ్చైవ భవతా ప్రాపితౌ ధృతిమ్ ॥

తా॥ మొట్టమొదట జనసంచారము చేయజాలని రమ్యమగు అరణ్యమునందు సీతాదేవి అపహరింపబడుటచే భీతినంది ఏమి చేయుటకు తోచనివాడనై సీతనే ఆలోచించుకొనుచు నుండగా నేను, నా సోదరుడగు లక్ష్మణుడును నీచే ధైర్యము నందగలిగితిమి.

శ్లో॥ తత స్సుగ్రీవసాచర్యాం వాఙ్మన స్తుల్యచేష్టితం ।
త్వయైవ వానరేంద్రో నూనం సింధుమధ్యే ప్లవో యథా॥

తా॥ పిదప సుగ్రీవునితో వాచా మనసా సమానత కలు స్నేహము సముద్రమధ్యమున నున్నవానికి తెప్పవలె నీచే అందించబడినది.

శ్లో॥ తతస్సీతాం మృగయతా భవతాకారి యత్సఖే ।
దుర్వచం తన్మమాద్యాపి కర్తుం వా కథ మీశ్వరః ॥

తా॥ సఖుడా! పిదప సీతను వెదకు. నీచే చేయబడిన పనులు నేను చెప్పలేను. ఇక చేయుట యెట్లు సాధ్యము ?

శ్లో॥ మత్సందేశ హరేణైవ సీతా సంలాలితా త్వయా ।
సీతాఽపి విగత ప్రాణా పునరుజ్జీవితా త్వయా ॥

తా॥ నా సందేశము తీసికొనిపోవుటద్వారా నీచే

సీత తేరుకొన జేయబడినది. ఆ సీత వశము దప్పిన ప్రాణములు కల్గి నీచే మరల జీవిత మందినదైనది.

శ్లో॥ బహునాత్ర కిముక్తేన లక్ష్మణః ప్రాణసన్నిభః ।
పున రుజ్జీవిత స్త్వేన తస్య కోపకృతి ర్వదేత్ ॥

తా॥ ఈ విషయమున పెక్కు చెప్పనేల ? ప్రాణ సమానుడగు లక్ష్మణుడే మరల బ్రతికింపబడినాడు. ఆ కారణమున దానికి తగు నుపకార మిట్టిదని ఎవరు చెప్పగలరు ?

శ్లో॥ ఏకైక స్యోపకారస్య ప్రతికర్తు మనీశ్వరాః
సహోదర్యా సహామాత్యా సకళత్రా స్సబాంధవాః ।
అన్యే మద్వంశజా నూన మృణికా వాయునందన ॥

తా॥ నీవు చేసిన ప్రతి ఒక్క ఉపకారమునకు ప్రత్యుపకారము చేయ నసమర్థులగు సోదరులతోను, మంత్రులతోడను, భార్యలతోడను బంధువుల తోడను కూడిన నా వంశమున బుట్టినవారందరు ఓ వాయునందనా నీకు ఋణపడియున్నారు.

శ్లో॥ తథాపి ప్రార్థయా మ్యద్య కరిష్యే భవ దీప్సితం ।
త న్మ మాచక్ష్వ భద్రం తే శృణు మత్ప్రార్థనాం కపే॥

తా॥ అయినను నేడు నీ కిష్టమగుదాని నొనర్చదలచితిని. అట్టి నీ కిష్టమగున దేదికలదో నాకు చెప్పవలసినదిగా ప్రార్థించుచున్నాను. ఓ వానరవీరా ! నా ప్రార్థన నాలకించుము.

శ్లో॥ ఇ త్యుక్తో రామచంద్రేణ వాయుపుత్రో మహాబలః ।
వినయావనతో భూత్వా బభాషే రఘునందనమ్ ॥

తా॥ అని రామునిచే చెప్పఁబడినవాఁడై మహాబలుఁడగు వాయునందనుఁడు వినయముచే నమ్రుఁడై ఆ రఘురాముని తోనిట్లనెను :

శ్లో॥ భవ త్పాదాబ్జయుగ్మేస్మిన్ భక్తిరస్త్వనపాయినీ
సర్వేషాం శ్రేయసాం మూలం బ్రహ్మాద్యై రపి దుర్లభా
య ద్యస్తి తే కృపా స్వామిన్ వర మేష వరో మమ॥

తా॥ ఓ స్వామీ ! ఈ నీ పాదపద్మ ద్వయమందలి భక్తి ఏ ప్రమాదములేక నిలిచిన చాలును. అదియే సర్వ శ్రేయములకు మూలమైనది. బ్రహ్మాదులకును దుర్లభమైన దగు నీ దయ యున్నచో అదియే నాకు శ్రేష్ఠమగు వరము.

శ్లో॥ ఇ త్యాకర్ణ్య వచ స్తస్య ప్రహస న్రఘునందనః
అ ప్యేవం భవతః కామః శాశ్వతః పవనాత్మజ ॥
కింతు మ త్ప్రార్థనాం శ్రుత్వా గృహాణేమం వరం పునః॥

తా॥ అను హనుమంతుని మాటలను విని రాముడు నవ్వుచు నిట్లనెను : ఓ వాయునందనా ! నీ శాశ్వతము కోర్కె అదియే. అయినను నా ప్రార్థన నాలకించి మరల ఈ వరమును స్వీకరింపుము.

శ్లో॥ భవతః పూజనీర్థాయ ప్రతిమారూపధారిణః
హనూమత్పుర నామానం గ్రామ మాచంద్రతారకం
గృహాణ మ దనుజ్ఞాతః ప్రతిష్ఠాసిద్ధయే తవ ॥

తా॥ ప్రతిమారూపమును ధరించిన నిన్ను ఆరాధించుటకై హనూమ త్పురమను పేరుగల గ్రామమును చంద్ర

నక్షత్రాదులుండు నంతకాలమున ప్రతిష్ఠ సిద్ధించుటకై నా ఆజ్ఞ ననుసరించి స్వీకరించుము.

శ్లో॥ తత్ర గ్రామే ద్విజశ్రేష్ఠాః శ్రోత్రియా సోమయాజినః
సర్వ శాస్త్రేషు కుశలాః నిత్యకర్మ పరాయణాః ॥

తా॥ ఆ గ్రామమునందు బ్రాహ్మణ శ్రేష్ఠులు వేదముల జదివి, యజ్ఞములు చేసినవారై, అన్నిశాస్త్రములందు పండితులై, నిత్యకర్మ పరాయణులయి;

శ్లో॥ స్వాచార నిరతా నిత్యం భవన్మంత్ర పరాయణాః ।
భవంతం పూజయిష్యంతః త్వామేవ శరణాగతాః ॥

తా॥ నిత్యము తమతమ వంశాచారములను నిర్వర్తించువారై, నీ మంత్రజపమే చేయువారై, నిన్నే పూజించుచు నీవే శరణుగ వేడువారై;

శ్లో॥ భక్త్యా త్వ మభిచారిణ్యః త్వయ్యావేశిత చేతసః

తా॥ భక్తితో నీవేగమ్యముగ చరించుచు, నీయందే మనసు నిల్పియుందురు.

శ్లో॥ ఇతి వాదిని రాజేంద్రే కౌసల్యానందవర్ధనే ।
సువర్చలాపతిః ప్రాహ తత్కాలసదృశం వచః ॥

తా॥ అని కౌసల్యానంద కారకుడగు శ్రీరామచంద్రుడు మాటలాడగా ఆ సమయమునకు తగిన విధముగా సువర్చలా నాధుడగు హనుమంతు డిట్లనెను :

శ్లో॥ భగవన్ దేవదేవేశ ! పురాణపురుషోత్తమ
భృత్యభావేన మే సంస్థా భవ ద్విగ్రహాసన్నిధౌ
అన్యథా మమ న ప్రీతిః ఇతి స్నేహా దభాషత ॥

తా॥ భగవంతుడవు, దేవదేవుడవు, పురుషోత్తముడవు నగు ఓ శ్రీరామచంద్రా ! నీ విగ్రహముకడ సేవకుని వలెనే నుండుటే కోరుదును. వేరొకదానిచే నాకు తృప్తి కలగదు, అని సాన్నిహిత్యమునుబట్టి పల్కినవాడై

శ్లో॥ హనుమాన్ ప్రతిజగ్రాహ గ్రామం విప్రజనాశ్రయం
హేమ ప్రాకార సహితం కలధౌత గృహోజ్జ్వలమ్ ॥

తా॥ హనుమంతుడు బ్రాహ్మణజన నిలయమగు నా గ్రామమును స్వీకరించెను. ఆ గ్రామము బంగరు ప్రాకారములతో కూడినట్టిది. వెండి, బంగారు గృహములతో ప్రకాశించుచున్నది,

శ్లో॥ చంద్రమండల పర్యంత వ్యాప్త ప్రాకార శోభితం ।
నానామాణిక్యఖచితం గోపురై ర ప్యలంకృతమ్ ॥

తా॥ చంద్రమండలమువరకు వ్యాపించిన ప్రాకారములచే ఒప్పునది, వివిధ మాణిక్యములు పొదిగిన గోపురములచే నలంకరింపబడినదియు;

శ్లో॥ అశ్వై ర్భద్రగజై ర్గోభిః స్యందనైః పరిపూరితం ।
నానాగణిత వీధీషు భాసురై రగ్నిహోత్రిభిః ॥
వేదశాస్త్ర పురాణౌఘ ఘోషై శ్చ పరిశోభితమ్ ॥

తా॥ మంచి గుఱ్ఱములతోను, ఏనుగులతోను, గోవుల తోను, రథములతోను నిండినది. అనేకముగా లెక్కకుమించి యున్న వీథులందు నిత్యాగ్నిహోత్రులగు, వేదశాస్త్ర పురాణ సముదాయమును పోషించు బ్రాహ్మణులచే ప్రకాశించునది;

శ్లో॥ హంస కారండ వాకీర్ణైః కుముదోత్పల పంకజైః
అలంకృతై స్తటాకై శ్చ దీర్ఘికాభి ర్విరాజితమ్ ॥

తా॥ హంసలు, కన్నెవేడు పక్షులు మున్నగు వాని తోను, తెల్ల కలువలు, వివిధ వర్ణముల కలువలు, పద్మములతోను అలంకరింపబడిన చెరువులతోను, దిగుడు బావుల తోను ఒప్పునట్టిది;

శ్లో॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యాది నానావర్ణైః పరిపూరితం

తా॥ బ్రాహ్మణులు, రాజులు, కోమటులు మున్నగు వివిధ జాతులతో నిండినది;

శ్లో॥ ఖర్జూర నారికేళాది పూగీ కదళికాదిభిః ।
తంత్రిణీ చూత పనస జంబీర హరిచందనైః ॥

తా॥ ఖర్జూరము, కొబ్బరి, పోక, అరటి మున్నగు వానితోను; చింత, మామిడి, పనస, నిమ్మ, మంచిగంధము మున్నగు చెట్లతోను;

శ్లో॥ కపిత్థ బిల్వామలకైః వనై రన్యై శ్చ శోభితమ్ ॥

తా॥ వెలగ, మారేడు, ఉసిరి మున్నగు వనములు, ఇంకను అనేక వృక్షములతో ప్రకాశించునది;

శ్లో॥ కేతకీ మల్లికా జాజి పున్నాగై శ్చంపకై శ్శుభైః।
వకుళాదిభి రన్యైశ్చ కుసుమై స్సుమనోహరైః
రమ్యం సమృద్ధిసంయుక్తం ఏవంవిధ మనుత్తమమ్ ॥

తా॥ మొగలి, మల్లె, జాజి, పున్నాగము, సంపెంగ, పొగడ మున్నగు శుభప్రదములగువానితోను ఇంకను ఇతర మనోహరములగు పుష్ప సముదాయముతో రమ్యమై ఇట్టి వాని సమృద్ధితో గొప్పదైనదియు;

శ్లో॥ మేరో ర్దక్షిణ దిగ్భాగే దశయోజన విస్తృతం।
అయుతం చ తథా చైవ ఘన గ్రామం తదా తతః ॥

తా॥ మేరు పర్వతమునకు దక్షిణ దిగ్భాగమున పది యోజనములు విస్తరించియున్న యది గొప్పదగు గ్రామము.

శ్లో॥ హనుమా నపి తం గ్రామం నామ్నా చ హనుమత్పురం
కృత్వా బహుభ్యో విప్రేభ్యః దదౌ ఆచంద్రతారకమ్॥

తా॥ హనుమంతు డా గ్రామమునకు హనుమత్పుర మను పేరుపెట్టి అనేక బ్రాహ్మణులకు ఆచంద్ర తారార్క మనుభవించుటకై ఇచ్చెను.

శ్లో॥ తస్మి న్పురే విప్రముఖ్యాః పరిపూర్ణ మనోరథాః
దేవాలయా న్హనుమత స్సహస్రాణి చతుర్దశ ॥

తా॥ ఆ గ్రామమునందలి బ్రాహ్మణ శ్రేష్ఠులు పరిపూర్ణ మనోరథులై హనుమంతుని పదునాల్గువేల దేవాలయములను,

శ్లో॥ కారయిత్వా మహాభాగం హనూమద్భక్తి సంయుతాః
చతుర్భుజాన్ దశభుజాన్ వీరరూపాం స్తథైవ చ॥

తా॥ కట్టించి హనుమద్భక్తిపూర్ణులై హనుమంతుని యొక్క విగ్రహములను నాల్గుచేతులు కలవానిని, పది చేతులు కలవానిని, అట్లే వీరరూపముననున్నవానిని;

శ్లో॥ భీమాకారా న్పంచముఖాన్ ఉష్ట్రారూఢాన్మహౌజసః
తతో ముకుళితకరాన్ శాంతరూపాం స్తతఃపరమ్॥

తా॥ భయంకర రూపము కల్గినవానిని, గొప్ప ఒంటె వాహనము నెక్కినవానిని, జోడించిన చేతులు కలవానిని, అట్లే శాంతస్వరూపము కలవానిని;

శ్లో॥ తథా సువర్చలోపేతాన్ ఉగ్రరూపాన్ మహాత్మనః
ఏవం విధా న్విగ్రహాం శ్చ కారయిత్వా హనూమతః॥

తా॥ సువర్చలాదేవితో కూడియున్నవానిని, ఉగ్ర రూపము కలవానిని, ఇట్టి అనేక విధములగు హనుమ ద్విగ్రహములను చేయించి;

శ్లో॥ తే ష్వాలయేషు సంస్థాప్య నిత్యం సేవాపరాయణాః
మహోత్సవరతాశ్చైవ తస్థు స్స్వర్గేఽమరా ఇవ॥

తా॥ ఆ పదునాల్గువేల దేవాలయములందు వానిని ప్రతిష్ఠించి నిత్యసేవ లొనర్చుచు, ఆయా సమయములందు మహోత్సవము లొనర్చుటయందు నిమగ్నులై ఆ గ్రామమున స్వర్గమున దేవత లుండున ట్లుండసాగిరి.

ద్విచత్వారింశ త్పటలః

శ్లో॥ కదాచి త్కాలయవన నందనః సురకంటకః
పాపిష్ఠో దుర్ముఖో నామ మహాబల పరాక్రమః॥

తా॥ ఒకానొకప్పుడు కాలయవనుని కుమారుడు దేవతలకు ప్రమాదకారి, పాపిష్ఠి, మహాబలపరాక్రమములు కల్గిన దుర్ముఖుడు అను పేరు గలవాడు.

శ్లో॥ చతురంగబలోపేతః మదాంధ శ్చ భయంకరః
విప్రాణాం ధనధాన్యాని హనుమత్పురవాసినామ్
హరిష్యామీతి దుర్బుద్ధ్యా తత్పురందుర్ముఖో యయౌ॥

తా॥ రథగజతురగ పదాతిదళములతో కూడినవాడై భయంకరుడు, మదాంధుడు అగు నాతడు హనుమత్పురమున నివసించు బ్రాహ్మణుల ధనధాన్యములను అపహరింతునని దుర్బుద్ధితో దుర్ముఖుడు ఆ గ్రామమునకు వెడలెను.

శ్లో॥ పురస్య నికటం ప్రాప్య యవనో దుర్ముఖ స్తథా
పురస్తాన్విప్రముఖ్యాంశ్చ సమాహూయైవ మబ్రవీత్॥

తా॥ ఆ గ్రామ సమీపమును చేరి దురాత్ముడగు దుర్ముఖుడు అచ్చటి బ్రాహ్మణ ముఖ్యులను తన యెదుటకు పిలచి యిట్లు పలికెను.

శ్లో॥ భో భూసురా! యుష్మదీయం చిరకాలార్జితం ధనం
సర్వందత్వాద్యమేయూయంపురంత్యక్త్వా బహూర్జితమ్॥

తా॥ ఓ బ్రాహ్మణులారా! మీరు చాలాకాలముగా

సంపాదించిన ధనము నంతటిని నేడు నాకిచ్చి ఈ గొప్పదగు గ్రామమును వీడి

శ్లో॥ సకళత్రా స్సపుత్రా శ్చ గచ్ఛధ్వం చ సబాంధవాః

తా॥ భార్యలతోను, పుత్రులతోను, బంధువులతోను కూడి వెళ్ళిపోవలసినది.

శ్లో॥ ఇత్యేవం దుర్ముఖవచః శ్రుత్వా సర్వే మహాద్విజాః
నిర్భయా ధైర్యసంపన్నా స్తమూచు ర్దుర్ముఖం ప్రతి ॥

తా॥ అని ఈ రీతిగనన్న దుర్ముఖుని మాటలు విని ఆ బ్రాహ్మణులందఱును నిర్భయముగా ధైర్యసంపత్తి కలవారై ఆ దుర్ముఖునితో నిట్లనిరి.

శ్లో॥ త్రేతాయుగే హనుమతా వీరేణ పురముత్తమం
అస్మభ్య మూర్జితం దత్తం స్థానత్యాగం తు నోచితః॥

తా॥ త్రేతాయుగమందు వీరుడగు హనుమంతునిచే ఉత్తమమగు ఈ పట్టణము మాకు దృఢముగ నీయబడినది. ఈ స్థానమును మేము వీడిపో తగదు.

శ్లో॥ సర్వథా యది న త్యాజ్యో గ్రామోఽయంచిరసంశ్రితః
తస్మిం దాతాహనుమాన్నోయచ్చాస్మత్కులదైవతమ్ ॥

తా॥ ఈ గ్రామము ఈరీతిని వీడతగదు. ఈ గ్రామము మాకు చాలాకాలముగా ఆశ్రయము అదియుగాక మా కులదైవము అగు హనుమంతుడు మాకు దానమిచ్చినది.

శ్లో॥ కింనుని ష్కాదయే దస్మాంత్వయమే వాశ్రితాన్ ప్రభుః
తదాయామో వయంత్యక్త్వా గ్రామ మద్యైవ దుర్ముఖ॥

తా॥ మాకు ఆశ్రయుడైన హనుమంతుడు మమ్ము ఇటనుండి నెట్టివేయునా ? అట్లు ఆతడే వెళ్ళుమనిన యెడల ఇప్పుడే వెళ్లిపోయెదము.

శ్లో॥ ఇత్యుక్త్వా యవనసుతం ద్విజాతిసంఘా
నిర్భీతా హనుమదనుగ్రహ ప్రభావాత్
పాదాబ్జే కులదైవతస్య సంతో
హృత్పద్మేషు విభయాంబభూవుః ॥

తా॥ యవననందనుడగు దుర్ముఖునితో ఆ బ్రాహ్మణ సమూహము హనుమదనుగ్రహ వశమున భయములేనివారై పైరీతిగ చెప్పి కులదైవతమగు హనుమంతుని పాదపద్మము లను తమ హృదయములందు నిల్పి ధ్యానింపదొడగిరి.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం శ్రీ పరాశరమైత్రేయ సంవాదే శ్రీ వీరహనుమన్మాలామంత్ర ప్రభావకథనం నామ ద్విచత్వారింశ త్పటలః



## త్రిచత్వారింశత్పటలః
## శ్రీ హనూమద్భక్త కథనం

శ్రీ పరాశరః-

శ్లో॥ ఇదం శ్రుత్వా బ్రాహ్మణానాం వాక్యం యవననందనః
ఆమర్షయుక్తో దుష్టాత్మా ప్రత్యువాచ సతాంప్రతి ॥

తా॥ శ్రీ పరాశరులవారు మైత్రేయులతో ఇట్లు చెప్ప దొడగిరి. పై రీతిగా అనిన బ్రాహ్మణుల వాక్యములను కాల యవనుని పుత్రుడగు దుర్ముఖుడు విని కోపమునందినవాడై దుష్టాత్ముడగు నతడా సద్బ్రాహ్మణులతో నిట్లనెను.

శ్లో॥ హనుమానాన్నమ కో విప్రా యస్తు మూఢైః ప్రగద్యతే
అహం తు రాజా సర్వేషాం లోకానా మపి చేశ్వరః॥

తా॥ ఓ విప్రులారా! మీలాంటి మూఢులచే చెప్ప బడు ఆ హనుమంతుడనువాడెవరు? నేనే అందఱకు రాజును, లోకములన్నిటికి ప్రభువును.

శ్లో॥ మ దన్యభజనా స్సర్వే హతభాగ్యా హతౌజసః
అన్నపానవిహీనంచ గమిష్యథ యథాతథమ్ ॥

తా॥ నన్ను కాక ఇతరులను భజించువాఱందఱు మందభాగ్యులు శక్తిహీనులున్నూ. వారు అన్నపానములు లేనివారై పోదురు.

శ్లో॥ యుష్మన్నపద్యతాబుద్ధ్యానహన్యామ్యహమీదృశాన్
యది నాగచ్ఛథాద్యైవ బ్రాహ్మణా నపి పీడయే ॥

తా॥ మీ నికృష్టమగు బుద్ధివలన ఇట్టివారందఱను చంపుటలేమ. ఇప్పటికైన వెళ్ళనచో బ్రాహ్మణులను కూడ నాశనమొనర్తును.

శ్లో॥ ఏవం శ్రుత్వా మునే ! విప్రా వచనం యవనోదితం
శ్వో గచ్ఛామోవయంసర్వే ఇత్యుక్త్వా వివిశుః పురమ్॥

తా॥ ఓ మైత్రేయా! ఈ రీతిగా దుర్ముఖుడు చెప్పిన మాటను విని వారందఱు రేపు వెడలిపోయెదమని చెప్పి పురములోనికి యథాప్రకారము చేరిరి.

శ్లో॥ ప్రవిశ్య చ తదా దేవం హనూమంతం మహాబలం
తుష్టువుః కేచి దపరే పూజాం చక్రు స్సమాహితాః ॥

తా। అలా పురమున ప్రవేశించి అప్పుడు మహాబల సంపన్నుడు, దేవదేవుడు నగు హనుమంతుని స్తోత్రము చేసిరి. కొందఱు ఒకచోట చేరి హనుమంతుని పూజచేయ నారంభించిరి.

శ్లో॥ కేచి ద్ధ్యుః కృతాత్మానో జేపు స్తన్మంత్రకోవిదాః
తా॥ మరికొందరు ధ్యానము చేయగా కొందఱు మంత్రవేత్త లగువారు అవహితచిత్తులై మంత్రములు జపించిరి.

శ్లో॥ విప్రాణాం ధ్యాయతా మేవం దండవ న్నమతాం భువి
హనూమదాలయేభూయః జపతాం మంత్రముత్తమమ్ ॥

తా॥ ఇట్లు ధ్యానమంత్రములతో బాటు దండప్రణామ ప్రాణాచారములుమ జరుపుచుండెను.

శ్లో॥ అపూపా మధురా స్స్వాద్యాః ఫలాని వివిధాని చ
నివేదితాని దేవాయ సంభ్రమా ద్ద్విజపుంగవైః ॥

తా॥ ఆ బ్రాహ్మణులచే తియ్యని అప్పములు, వివిధములగు పండ్లు తొందరగ శ్రీ హనుమంతునకు నివేదన చేయబడినవి.

శ్లో॥ హనుమాన్ కస్యచి త్స్వప్నే జగాదశ్లోక యోర్ద్వయమ్॥

తా॥ హనుమంతు డొకని స్వప్నమున సాక్షాత్కరించి రెండు శ్లోకములను చెప్పెను.

శ్లో॥ మాంధాతా చమహీపతిః కృతయుగాలంకారభూతో౽గతః
సేతుర్యేన మహోదధౌ విరచితః క్వాసౌ దశాస్యాంతకః ॥
అన్యేచాపి యుధిష్ఠిర ప్రభృతయః తే కీర్తి శేషం గతాః
నైకేనాపి సమంగతా వసుమతీ నూనం త్వయాయాస్యతి॥

తా॥ కృతయుగమున కలంకారభూతుడైన మాంధాతృ మహారాజు వెడలిపోయినాడు. మహాసముద్రమునకు వారధి నిర్మించిన, రావణాంతకుడైన ఆ రాముడు ఏడీ? ఇంకను మిగిలినవారు ధర్మరాజు మున్నగు మహనీయులును కీర్తి శేషులైనారు. వారెవ్వరితో నే యొక్కరితోను కూడి ఈ భూమి పోలేదు. ఈ భూమి నీతోనే వచ్చుచున్నది.

శ్లో॥ ఆత్మదత్తాపహార యః శ్మశ్రో రీనచతరో హి సః
అన్యైస్తు చర్ధితం భుంక్తే న స్వాత్మ చర్ధితం క్వచిత్ ॥

తా॥ తా నిచ్చినదానినే అపహరించునట్టివాడు వెంట్రుక కంటె నీచుడు, ఇతరులు కక్కినదాని నెవడైన అనుభవించునుకాని తాను కక్కిన కూటినే తాను ఎవ్వడు అనుభవింపడు.

(కొన్ని ప్రతులయందు మొదటి శ్లోకమునకు బదులుగ నీ క్రింది శ్లోకము కానవచ్చుచున్నది.)

శ్లో॥ గవాం ద్విజన్మనాం సద్యో మహ త్సంకటగామినాం
ఉదాస్తే త త్సమర్థోఽపి రౌరవం నరకం వ్రజేత్ ॥

తా॥ గోవులకు, బ్రాహ్మణులకు ఆపద కల్గినపుడు దానిని తొలగించగలిగియు ఉపేక్ష వహించువాడు రౌరవ నామక నరకము ననుభవించును )

శ్లో॥ శ్లోకద్వయం భవంతోఽద్య యవనం శ్రావయంతు తం
శ్రుత్వా సగచ్ఛేన్నో చేత్తు ప్రతికృత్యం కరోమ్యహమ్ ॥

తా॥ ఈ శ్లోకములు రెంటిని మీరు కాలయవనసుతునకు విన్పించండి. వానిని విని ఆతడు పోగలడు. అట్లు పోకున్నచో చేయదగు కార్యమును నేను చేతును.

శ్లో॥ ఇత్యుక్త్వాంతర్దధే వీరో హనుమా న్భక్తవత్సలః
తత ఉత్థాయ విప్రేంద్రో బ్రాహ్మణేభ్యో యథాతథమ్॥

తా॥ అని పలికి భక్తవత్సలుడగు హనుమంతుడు అంతర్ధానమందెను. పిదప ఆ బ్రాహ్మణోత్తముడు నిద్దుర లేచి తోటి బ్రాహ్మణులకు ఉన్నది ఉన్నట్లుగా-

శ్లో॥ వర్ణయామాస వృత్తాంతం శ్రుత్వా తే హృష్టమానసాః
గత్వా పరేద్యుస్తే విప్రా స్తస్మై శ్లోకయుగం తథా ॥

తా॥ తన స్వప్నవృత్తాంత మంతను వర్ణించి చెప్పెను. వారు దానిని విని సంతసించిరి. ఆ మరుసటి రోజున వారందఱు వెడలి ఆ రెండు శ్లోకములను-

శ్లో॥ శ్రావయామాసు రహస్యయ యవనాయ దురాత్మనే
శ్రుత్వైవ రాక్షసేంద్రోఽపి కోప విస్ఫురితాధరః ॥

తా॥ ఆ కాలయవన సుతుడు, దురాత్ముడు అగు వానికి విన్నవించిరి. ఆ రాక్షసుడు విని కోపముచే అదరు పెదవి కలవాడై

శ్లో॥ హుంకృత్య విప్రాన్గచ్ఛధ్వం శీఘ్రైర్వేత్యచోదయత్
శ్రుత్వా సంభర్త్సనం వాక్యం శ్వస్తుగచ్ఛామహేవయమ్
ఏవం సమాధీయ ఖలం వివిశుః పుర ముత్తమమ్ ॥

తా॥ ఆ బ్రాహ్మణులను హుంకరించి శీఘ్రముగ వెడలిపొమ్మనెను. వాని కోపముతో కూడిన మాటలు విని 'అయ్యా! రేపు మేము వెడలెదము' అని సమాధానపరచి ఉత్తమమగు ఆ గ్రామమున మరల ప్రవేశించిరి.

శ్లో॥ తత్ర సంభూయ విప్రేంద్ర ఉపాయం తన్నివర్తకం
చింతయంతో నతగ్రీవాః జానుస్థిత ముఖాంబుజాః ॥

తా॥ ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! మైత్రేయా! వారంద అచ్చట చేరి ఆ రాక్షసుని నివారించు నుపాయమాలోచించు వారై మెడలువంచి, మోకాలిపై ముఖము నుంచుకొనిన వారై

శ్లో॥ కస్త్రాతానోఽద్య సర్వేషాం దుస్తరా దాపదంబుధేః
అన్యోన్య మితి జల్పంతః ప్రత్యేకం దుఃఖవిహ్వలాః ॥

తా॥ మనలను ఈ భయంకరమగు ఆపత్సముద్రము నుండి రక్షించు వాడెవరు? అని పరస్పరము ప్రశ్నించుకొనుచు దుఃఖముతో కలతనందినవారై

శ్లో॥ అముంచతా శ్రువర్షాణి ధారా ఇవ ఘనాఘనాః ।
రుదతో బ్రాహ్మణ శ్రేష్ఠాన్ దృష్ట్వా సర్వే పురోభవాః॥

తా॥ మేఘము వర్షోదకమును కురిసినట్లు వారు దుఃఖాశ్రువులను విడచిరి. అట్లు ఏడ్చుచున్న బ్రాహ్మణులను చూచి ముందున్న అందఱు

శ్లో॥ స్త్రియో వృద్ధాశ్చ బాలా శ్చ రురుదు ర్ముక్త కంఠకం
గృహపాలా స్తతో భూయః ద్వారపాలాః పరస్పరమ్॥

తా॥ స్త్రీలు, వృద్ధులు బాలురు, ముక్తకంఠముతో నేడ్చిరి. ఇంటి కావలిగాండ్రు, ద్వారపాలకులు,

శ్లో॥ గోపాలోద్యానపాలా శ్చ వికీర్ణ హృదయా శ్శుచి
తత్ర కేచి న్మహాత్మానః ధైర్య మాస్థాయ యత్నతః

తా॥ గోపాలురు, ఉద్యానపాలకులును స్థితితప్పిన వారైరి. అట కొందఱు మహాత్ములు ప్రయత్నపూర్వకముగ ధైర్యము తెచ్చుకొని

శ్లో॥ వారయాంచక్రిరే దుఃఖాత్ దుఃఖితం పౌరమండలం
హనుమా నేవ న స్త్రాతా స్మృతస్సర్వాఘనాశనః ॥

తా॥ దుఃఖించువారిని ఆ దుఃఖమునుండి వారింపదొడగిరి. స్మరణముచేతనే సర్వపాపములను నాశనమొనర్పజాలు హనుమంతుడే మనకు రక్షకుడు.

శ్లో॥ ఇత్యేవం భాషమాణా స్తే ముమృజు ర్దుఃఖకర్దమం
స్వయం తదా సమాధాయ మానసం దుఃఖచంచలం
జేపు స్సర్వే తదా వీర హనుమన్మంత్ర ముత్తమమ్॥

తా॥ ఇట్లు పల్కుచు వారు దుఃఖమును బరదను కడగివైచిరి. ఆ బ్రాహ్మణులును దుఃఖముచే చలించుచున్న మనస్సును స్వయముగ సమాధానపఱచుకొని అప్పుడు అందఱును ఉత్తమమగు వీరహనుమన్మంత్రమును జపించిరి.

శ్లో॥ జితాహారా జితక్రోధా జిత శీతోష్ణవాయవః
ధ్యాయంతో హృదయాబ్జే స్వే హనుమత్పదపంకజమ్॥

తా॥ ఆహారమును వదలినవారై క్రోధమును జయించినవారై శీతోష్ణ వాయువులను సైతము జయించి తమ హృదయకమలములందు హనుమంతుని పాదపద్మములనే ధ్యానించువారై.

శ్లో॥ వ్రతే శరావోదయ నామసంయుగే
దత్వా బహుభ్యో ద్విజనందనేభ్యః
అపూపసారాన్ సఘృతాన్ సపాయసాన్
సంతర్పయామాసు రథాంజనాసుతమ్ ॥

తా॥ శరావోదయ వ్రతము బూని నేతితో కూడిన అప్పములను, పాయసములను అనేకులగు బ్రాహ్మణులకు దానమొనర్చి శ్రీ ఆంజనేయుని తృప్తి పఱచిరి.

శ్లో॥ శరావోదయ నిష్ణాతాః వాగ్యత్న వియత వ్రతాః
చక్రు స్సమాప్తి తత్ర హనూమద్వ్రత ముత్తమమ్ ॥

తా॥ వారు శరావోదయవ్రత నిష్ణాతలై మాటలందు చేతలందును నియతమగు వ్రతము కలవారై అచట ఉత్తమమగు ఆ హనుమ ద్వ్రతమును పూర్తి చేసిరి.

శ్లో॥ ఇతి భక్తాపదం వీక్ష్య హనుమాన్ కరుణానిధిః
ఉవాచ మధురాం వాణిం అదృశ్యనిజవిగ్రహః ॥

తా॥ ఈ విధముగానున్న తన భక్తుల ఆపదలను దయామయుడగు హనుమంతుడు చూచి తన స్వరూపమును కన్పడనీక మధురమగు వాక్కుల నిట్లు పల్కెను.

శ్లో॥ భో భో విప్రా మహాభాగాః న బిభ్యేత కదాచన
మయి త్రాతరి భక్తానాం నాశుభం విద్యతే క్వచిత్ ॥

తా॥ మహానుభావులగు ఓ బ్రాహ్మణులారా! మీ రెప్పుడును భయపడవద్దు. నేను భక్తులను రక్షించుచుండగా వారికెప్పటికిని అశుభము కలుగదు.

శ్లో॥ వసుధాం సర్వసస్యాఢ్యాం బ్రాహ్మణేభ్యో వితీర్య యః
గృహ్ణాతి చేత్పున ర్లోభాత్ స యాతి నరకాన్బహూన్ ॥

తా॥ సర్వసస్య సమృద్ధి కల భూమిని బ్రాహ్మణులకు దానమొసర్చి ఎవ్వడైన మరల లోభముచే స్వీకరించెనేని వాడు పెక్కు విధముల నరకముల ననుభవించును.

శ్లో॥ ఉపేక్షేత చ యో దాతా శక్తోఽపి పరిపాలనే
సోఽపి మూఢమతి ర్విప్రా! రౌరవం నరకం వ్రజేత్ ॥

తా॥ ఆ భూమిని బ్రాహ్మణులను రక్షించుటలో సమర్థుడయ్యు ఏ దాత ఉపేక్ష వహించునో ఆ మూఢమతి కూడ ఓ బ్రాహ్మణులారా! రౌరవ నామక నరకము ననుభవించును.

శ్లో॥ గవాం ద్విజన్మనాం సద్యః మహ త్సంకటగామినాం
ఉత్థాపనే సమర్థోఽపిసోఽపి దుర్గతి మాప్నుయాత్ ॥

తా॥ గొప్ప ప్రమాదమునకు గురియైన గోవులను, బ్రాహ్మణులను రక్షించుటయందు సమర్థుడై కూడు ఎవ డుపేక్ష వహించునో వాడు దుర్గతి నందును.

శ్లో॥ సర్వేషామేవ జంతూనాం ప్రాణః ప్రియతరో భృశం
మమ భక్తజనాః ప్రాజ్ఞాః ప్రాణప్రియతరో మమ
ఇత్యుక్త్వా కపినాథోఽపి విరరామ జగామ చ ॥

తా॥ సమస్త ప్రాణికోటికి ప్రియతరమైనది ప్రాణము. నాకు మాత్రము ఓ బ్రాహ్మణులారా ! నా భక్తులే ప్రాణ సమానమగు నిష్టము అని హనుమంతుడు చెప్పి వెడలి పోయెను.

శ్లో॥ తతో విప్రా స్సముత్థాయ హనుమత్పురవాసినః
విస్మయం పరమం జగ్ముః అశరీరవచ శ్శ్రివాత్ ॥

తా॥ పిదప హనుమత్పురవాసులగు బ్రాహ్మణులు లేచి ఆ వినవచ్చిన అశరీర వాక్కులకు మిక్కిలి ఆశ్చర్యము నందిరి.

శ్లో॥ తదా హృష్టా ద్విజశ్రేష్ఠాః హనుమన్మంత్ర తత్పరాః
పరస్పరం ప్రశంసంతః హనుమద్వైభవం పరమ్ ॥

తా॥ అప్పుడా హనుమన్మంత్ర తత్పరులగు బ్రాహ్మణోత్త ములు సంతసించినవారై గొప్పదగు హనుమచ్ఛక్తిని ఒకరి కొకరు వివరించుకొనదొడగిరి.

శ్లో॥ సర్వే తే హ్యాత్మసు ప్రజాః యవనాక్రాంత వృత్తిషు
ఆంజనేయ కృపాపూర్ణ సేచనం మేనిరే ద్విజాః ॥

తా॥ ఆత్మజ్ఞానవంతులగు ఆ బ్రాహ్మణులందఱు కాల యవనసుతుడగు రాక్షసుని చేష్టలందు హనుమంతుని దయను భావించిరి.

శ్లో॥ హనుమా నపి తం దేశం అగమత్త్వరయాన్వితః
యత్రాస్తే యవనో మూఢః సేనాకలకలాన్వితః ॥

తా॥ హనుమంతుడు కూడ త్వరితగతిని ఆ మూఢుడగు యవనుడున్నట్టి సేనల కలకలనాదములు విన్పించునట్టి, ప్రదేశమునకు వచ్చెను.

శ్లో॥ మహావానర రూపేణ దుర్ముఖస్య చమూం తథా
ప్రదక్షిణీ చకారాసౌ నిఖిలాం వలయాత్మనా ॥

తా॥ ఆ హనుమంతుడు పెద్ద కోతిరూపములో ఆ దుర్ముఖుని సేననంతను ఒక్కమారు చుట్టివచ్చెను.

శ్లో॥ ఏవం ప్రక్రామ్య పూర్వేణ గత స్తేషాం ప్రపశ్యతాం
తం దృష్ట్వా గూఢచార స్తు యవనాయ న్యవేదయత్ ॥

తా॥ ఈ రీతిగా చుట్టి వారు చూచుచుండగనే తూర్పుదిశగా వెడలెను. ఆ వానరుని ప్రదక్షిణ మొనర్చు వానిని చూచి గూఢచారులు యవనునకు తెలియజేసిరి.

శ్లో॥ భో రాజన్ కస్య నామేదం తను ర్వానరరూపధృత్ ।
రక్తాక్షః పర్వతాకార సంకాశోఽతివిభీషణః ॥

తా॥ ఓ రాజా! ఈ గ్రామనామము కలవాడు, వానర దేహము ధరించినవాడు, ఎఱ్ఱని కన్నులు కలవాడు, పర్వత ముతో సమానమగు ఆకారము కలవాడు, మిక్కిలి భయం కరుడైనవాడు;

శ్లో॥ దీర్ఘవాలో మహాబాహుః సేనాం ప్రక్రమ్య తావకీం
సేనానివేశ తుల్యేన పాషాణేన దృఢాత్మనా
ఛాదయ న్నివ వేగేన భీతి మేతాం ప్రభూత్తమ ॥

తా॥ పొడవైన తోకకలవాడు, దీర్ఘబాహువు కల వాడు నగు నతడు నీ సేననంతను చుట్టెను. మన సేనయొక్క ఆవరణముతో సమానమగు బలమైన పాషాణముతో ఈ సేన నంతను కప్పివేయునేమో యను భయము కలుగుచున్నది.

శ్లో॥ విలోక్యాఽభిముఖం పూర్వాం ప్రతస్థేఽచలసన్నిభః
ఇమాం సేనాం నయావన్నో హవిష్యతి బలోద్ధతః
తావదేవత్వయా చాస్యా రక్షోపాయో విచింత్యతామ్॥

తా॥ ఆ పర్వత సమానుడగువాడు ఈ సేననంతను చూచిన పిదప తూర్పు దిక్కునకు వెడలెను. ఓ దుర్ముఖా! బలవంతుడగు నీతడే సేననంతను చంపులోపలనే దీనిని రక్షించు నుపాయము నీవాలోచించనగును.

శ్లో॥ గ్రామోఽయంవిప్రముఖ్యేభ్యోదత్తా హనుమతా ప్రభో!
అస్య సోఢుం న వై భంగం శక్తోఽయం బలినాంబలీ ॥

తా॥ ఓ ప్రభూ! ఈ గ్రామము హనుమంతునిచే బ్రాహ్మణశ్రేష్ఠులకు దానమీయబడినది. ఈ గ్రామమును

భంగము చేయుట నతడు సహించడు. అతడు బలవంతులలో బలవంతుడు.

శ్లో॥ విక్రాంతో విజయీ మానీ సంగ్రామే ష్వపరాజితః
కాలనేమిర్హతో యేన రావణి శ్చాక్షనామకః ॥

తా॥ శూరుడు, జయశీలి, మానవంతుడు, యుద్ధమున పరాజయము లేనివాడును, ఇంకను ఆతనిచే కాలనేమియు, రావణకుమారుడగు అక్షయకుమారుడును చచ్చిరి.

శ్లో॥ బహుశః రాక్షసా స్సంఖ్యే హతా స్తేన మహాత్మనా
తస్మాత్త్వం రక్ష సేనాం నః భీతాంతర్గత చేష్టయా ॥

తా॥ ఆ మహాత్ముడగు హనుమంతునిచే లెక్కకు మిక్కుటముగ రక్కసులుక్కడగింపబడిరి. కావున మనసున భయముంచుకొని తగు విధమున ఈ రాక్షససేనను రక్షింపుము.

శ్లో॥ రాత్రౌ జీవేమ సర్వేఽద్య వయం జీవేమ శాశ్వతం
ఇతి చారవచ శ్శ్రుత్వా యవనో భయవిహ్వాలః ॥

తా॥ ఈ రాత్రికి మనమందరము బ్రతికి బయటపడినచో మనము శాశ్వతముగ బ్రతుకగలము అను చారుల వాక్యములను యవనుడు విని భయకంపితుడై

శ్లో॥ తస్మా ద్దేశా దపక్రాంతో జానన్నపి చమూం కపిః
నిజభక్తి ప్రభావస్య ప్రకాశనకృతే కృతీ ॥

తా॥ ఆ ప్రదేశమునుండి వెడలిపోయెను. హనుమంతున కీవిషయము తెలిసినను తన భక్తి ప్రభావమును ప్రకటన చేయ సమర్థుడగు

శ్లో॥ తస్యాం రాత్రౌ హనూమాంస్తుశైలముత్పాట్య వేగతః
పూర్వం యత్రోషితో సేనా స్వయం చ వలయీకృతా
యావత్సేనాసన్నివేశం పాతయామాస పర్వతమ్ ॥

తా॥ హనుమంతుడు ఆ రాత్రియే పర్వతము నొక దానిని వేగముగ పెకలించితెచ్చి పూర్వము సేన ఎక్కడ విడిసెనో, తానెచ్చట పరిభ్రమించెనో ఆ సేనయొక్క స్థావరమున పర్వతమును పడవైచెను.

శ్లో॥ దృష్ట్వా ప్రభాతే సా సేనా స చ రాక్షసనందనః
విస్మయావిష్టమనసో భయభారావపీడితాః ॥

తా॥ తెల్లవారగనే ఆ సేన, దుర్ముఖుడు ఆ పర్వతమును చూచి ఆశ్చర్యచకితులై భయముచే పీడింపబడి

శ్లో॥ జీవితాస్మ వయం దైవా దిత్యూచుస్తే పరస్పరం
అథవా తద్వదత్రాపి పాషాణం విపులాయతం
పాతయిష్యతి కోపేన కిము భక్తవశంవదః ॥

తా॥ వారిలో వారిట్లనుకొనిరి : మనము దైవానుగ్రహమున బ్రతికిపోతిమి. అట్లుకాక మనము వెనుకటివలె నుండగా భక్తవశంవదుడగు హనుమంతుడు కోపముతో అంతటి పర్వతమును విసిరినచో ఇంకేమున్నది ?

శ్లో॥ ఇతి త్రస్తాన్సమాలోక్య సైనికాన్ యవనాత్మజః
మాభైష్టేతి సమాశ్వాస్య సాంత్వయామాస సామవిత్ ॥

తా॥ అని భయమందుచున్న సైనికులను చూచి సామోపాయ మెఱిగిన యవనుడు మీరు భయపడవలదని యూరడించెను.

శ్లో॥ తతో విప్రాన్ సమాహూయ స రాజా యవనాధిపః
అగ్రణ్య మగ్రతః కృత్వా వచనం చేద మబ్రవీత్ ॥

తా॥ పిమ్మట ఆ రాక్షసరాజగు దుర్ముఖుడు బ్రాహ్మ ణుల నందఱను రావించి ముందుగ వారికి నమస్కరించి ఇట్లు పల్కెను:

శ్లో॥ శ్రుణుధ్వ మనయం విప్రా దర్పా దుత్థిత మద్య మే
యాదృశా త్పురుషో మృత్యుః జాతకల్పో మహా నభత్
మదీయ సేనయా నూన మనన్యశర ణాశయా ।
భవత్సందర్శనా దేవ సంతీర్ణో హ్యాపదంబుధేః ॥

తా॥ ఓ బ్రాహ్మణులారా! వినవలసినది. గర్వమంది మృత్యువే ఎదురై వేరు శరణ్యములేకయున్న నన్ను, నా సేనను సందర్శనమే ఆపత్సముద్రమునుండి బయటపడవైచినది.

శ్లో॥ అద్యప్రభృతి విప్రేంద్రా హనుమత్పురవాసినః
యథా సుఖం యథావృత్తి వసంతు త్యక్త సాధ్వసాః ॥

తా॥ హనుమత్పురమున వసించుచున్న ఓ బ్రాహ్మణ శ్రేష్ఠులారా! నేటినుండి భయమువీడి సుఖముగా ఇచ్చవచ్చిన ట్లుండుడు.

శ్లో॥ హనూమానేవ సర్వేషాంత్రాతాదాతా చ బుద్ధితః
అత్ర పూర్వాధికం యాయ మాంజనేయపరాయణః
శరావోదయ ముఖ్యాని కురుధ్వం తద్వ్రితాని వై ॥

తా॥ హనుమంతుడే అందఱకు రక్షకుడు, దాతకూడ. ఇప్పుడు వెనుకటికంటె ఎక్కుడుగ ఆంజనేయ నిష్ఠకలవారై శరావోదయ వ్రతాదులను నిర్వహింపవలసినది.

శ్లో॥ త దుత్సవం చ త త్పూజాం త త్సమారాధనం ముహుః
ప్రతిమాసం ప్రతిదినం కురుధ్వం ప్రతివత్సరమ్ ॥

తా॥ శ్రీ హనుమంతుని ఉత్సవములను, పూజలను, ఆరాధనలను ప్రతిమాసమున, ప్రతిదినమున, ప్రతిసంవత్సరమును మాటిమాటికి జరుపవలసినది.

శ్లో॥ నియుజ్యైవం ద్విజశ్రేష్ఠా న్రాజా యువననందనః
దదా తేభ్యో మహార్హాణి రత్నాని వివిధాని చ ॥

తా॥ అని యువననందనుడగు నారాజు ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుల నట్లు నియమించి వారికి గొప్ప విలువకల పెక్కు రత్నములను ఇచ్చెను.

శ్లో॥ గ్రామా నన్నపదాన్ దేవాన్ వస్త్రాణ్యాభరణానిచ
ధనధాన్యా ననేకాని గా శ్చ బహ్వయణి రపి ॥

తా॥ గ్రామములను, పల్లెలను, దేశములను, వస్త్రములను ఆభరణములను, ధనధాన్యములను అనేకములగు గోవులను, తఱిపియావులను,

శ్లో॥ గజా నశ్వాన్ రథా నుష్ట్రాన్ వామీ శ్చాపి సహస్రశః
ఏత నన్యా న్మహాభాగః బ్రాహ్మణేభ్యో న్యవేదయేత్ ॥

తా॥ ఏనుగులను; గుఱ్ఱములను, రథములను, ఒంటెలను, ఆడుగుఱ్ఱములను వేలకొలదిగనిచ్చి ఇంక నిట్టివానినవేకములనాతడా బ్రాహ్మణుల కిచ్చెను.

శ్లో॥ ఇతి విప్రాన్ సమాధాయ హనుమద్భక్త పుంగవాన్
క్షంతవ్యా న్యపరాధా నీ త్యభ్యవాద్య యథాగతః ॥

తా॥ ఇట్లు హనుమద్భక్తశ్రేష్ఠులగు ఆ బ్రాహ్మణులకు తృప్తిపరచి తన అపరాధములను క్షమింపవలసినదిగా కోరెను.

శ్లో॥ పరిష్వక్తో దృఢం ప్రేమ్ణా విప్రై ర్విగతమత్సరైః
సంప్రార్థయ న్నృపోఽభీష్టా నిత్యవోచ కృతాంజలిః

తా॥ అట్లుకోరి తనపై కోపముపోయిన బ్రాహ్మణులచే గొప్ప ప్రేమతో కౌగలింపబడినవాడై ఆ రాక్షసరాజు అంజలి ఘటించి తన కోర్కె నిట్లు ప్రార్థించెను.

శ్లో॥ అజ్ఞాతభూత పరిభూత వివేకశూన్యే
దత్వా కపీంద్ర పదపద్మ పరాగభూతిం
అధ్వాన మధ్వరకృత స్సుఖ మాత్మగేహే
శ్లో॥ దాశాధ్వ మాయు రగదం పరమాత్మవర్గే ॥

తా॥ అజ్ఞానమువలన పరాభవింపబడిన వివేకశూన్యుడగు నాయందు వానరాధీసుడగు హనుమంతుని పాదపద్మముల ధూళినుంచిరి. నాకు మార్గమును సుఖప్రదము నొనర్చి ఆయురారోగ్యములను అనుగ్రహింపుడు నావలె నా ఆప్తులను అనుగ్రహింపుడు.

శ్లో॥ ఇతి సంప్రార్థితా విప్రాః భూభృతా దీనవత్సలాః
అన్యోన్యసమ్మతా సర్వే తథాస్త్విత్యబ్రువన్ ముదా ॥

తా॥ అని ఆ దుర్ముఖునిచే ప్రార్థింపబడి ఆ బ్రాహ్మణులు దీనవత్సలు లగుటవలన పరస్పరమందఱిష్టులై సంతోషముతో 'తథాస్తు' అనిరి.

శ్లో॥ హనూమంతం మహాత్మానం ప్రణమ్య శిరసా తథా
త మేవ మనసా ధ్యాయన్ యయౌ యవననందనః ॥

తా॥ ఆ రీతిగా యవనసుతుడగు దుర్ముఖుడు మహాత్ముడగు హనుమంతునకు తలవంచి నమస్కరించి ఆ స్వామినే మనసున ధ్యానమొనర్చుచు వెడలెను.

శ్లో॥ ఏవం ప్రభావో హనుమాన్ భక్తరక్షణ తత్పరః
తస్మిన్భక్తి ర్విధాతవ్యా మైత్రేయాభీష్టకామదే ॥

తా॥ భక్తులను రక్షించుటయందే ఎల్లప్పుడు నిమగ్నుడై యుండు హనుమంతుడిట్టి ప్రభావము కలవాడు. ఓ మైత్రేయా ! అభీష్టములనొసగు వానియందే ధ్యానముంచదగును.

శ్లో॥ గ్రామే సంగ్రామదుష్ప్రాపే ప్రసాదా ద్ధనుమత్కపేః
కృతావాసా ధృతభ్యాసా పరిపూత గృహాంతరాః ॥

తా॥ యుద్ధమునందశక్తులగు వారా గ్రామమునందు అట్లు హనుమదనుగ్రహమువలన నిశ్చింతగా నివాసమందినవారై, సర్వనియమముల నభ్యాసమొనర్చువారై పరమ పవిత్రమగు గృహముల యందుండిరి.

శ్లో॥ అద్యాపి బ్రాహ్మణా స్తత్ర నిత్యకర్మ పరాయణాః
ధనధాన్య సమాయుక్తాః పుత్ర పౌత్రగ ణాన్వితాః ॥

తా॥ ఇప్పుడును అచ్చటి బ్రాహ్మణులు నిత్యకర్మ పరాయణులై, ధనధాన్యసమృద్ధులుకలిగి పుత్రపౌత్రాది గణములతో కూడి,

శ్లో॥ హానుమద్భక్తి సంజాత పూర్ణానం దాభినిర్భ్రితాః
మోదంతే బహుశ స్స్వర్గే యథా దేవా స్తథా భువి ॥

తా॥ హనుమద్భక్తివలన పుట్టిన సంపూర్ణమగు ఆనందముతో నిండినవారై స్వర్గమునందు దేవత లేరీతిగ నన్నివిధముల నానందింతురో ఆ రీతిగ భూమియందు సంతోషమున నుండిరి.

శ్లో॥ రాజాపి విప్ర వచనా త్పరిపూర్ణ కామః
సుప్త ప్రబుద్ధ ఇవ విస్మయ సస్మితాస్యః
జ్ఞానోదయేన సదయోఽఖిలభూతసంఘే
విప్రేషు దైవతమతిం మనసా చకార ॥

తా॥ రాజగు దుర్ముఖుడును బ్రాహ్మణుల ఆశీస్సులతో కోరికలన్నియు తీరినవాడై నిద్రనుండి మేల్కాంచినవానివలెనై, ఆశ్చర్యముతో కూడిన చిరునవ్వు మోమున కలవాడై జ్ఞానోదయమగుటచే సమస్తప్రాణులయందు మనస్ఫూర్తిగ దైవభావనమొనర్చి జీవించెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయసంవాదే శ్రీ హానుమద్భక్త
కథనంనామ త్రిచత్వారింశ త్పటలః



## చతుశ్చత్వారింశ త్పటలః - 44
## మైరావణ మాయా ప్రకరణం

శ్రీ మైత్రేయః

శ్లో॥ పరాశర మహాబాహో! జ్ఞాన విజ్ఞానసాగర!
హనూమత శ్చరిత్రం మే భూయః కథయ మారుతేః
న తుష్యామి మునిశ్రేష్ఠ శ్రోతు మాయత సత్కథామ్॥

తా॥ శ్రీ మైత్రేయులవా రడుగుచున్నారు— ఓ మహానుభావుడవగు పరాశరా, జ్ఞాన విజ్ఞానములకు సముద్రుని వంటివాడా! శ్రీ హనుమంతుని చారిత్రము మరల ఇంకను చెప్పవలసినది- ఓ మునిశ్రేష్ఠుడా! ఇంకను గొప్పదగు ఆ చరిత్ర నింకను కోరుచునే యున్నాను.

శ్రీ పరాశరః

శ్లో॥ శ్రుణు ష్వావహితో యోగిన్ కథాం హనుమతః ప్రభోః
అత్యద్భుతాం సువిస్తీర్ణాం మన స్సంతోష కారిణీమ్॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు- ఓ మైత్రేయ యోగీ! మిక్కిలి అద్భుతమైనదీ పెద్దది మనసుకు సంతోషమును కలిగించునది యైన హనుమత్ప్రభుని చరిత్రమును ధ్యానముంచి వినవలసినది.

శ్లో॥ పురా దాశరథి శ్శ్రీమాన్ వినిర్జిత దశానన
అయోధ్యాం ప్రాప్య సంహృష్టో ముముదే ససుహృజ్జనః

తా। పూర్వము దశరథసుతుడైన శ్రీరామచంద్రుడు

రావణాసురుని సంహరించి సంతోషముతో అయోధ్యను చేరి బంధు మిత్రాదులతో సుఖముగ నుండెను.

శ్లో॥ తత్ర సింహాసనాసీనం రామం దశరథాత్మజం
ద్రష్టుమభ్యాయయౌ యోగీ హ్యగస్త్యో బ్రహ్మవిత్తమః॥

తా॥ అప్పుడా సింహాసనాధిష్ఠుడగు, దశరథ నందనుడగు రాముని చూడనెంచి బ్రహ్మవేత్తలలో ముఖ్యుడును, యోగియు నగు అగస్త్యుడు వచ్చెను.

శ్లో॥ త మాగతం సమాలోక్య ప్రత్యుత్థాయ కృతాంజలిః
రాఘవః పూజయామాస పూజార్హం రిపుమర్దనః

తా॥ అట్లు వచ్చువానిని చూచి ఎదురేగి అంజలి ఘటించి శత్రునాశకుడగు రఘురాముడు పూజింపదగువాడగు అగస్త్యుని పూజించెను.

శ్లో॥ పూజిత స్తేన విప్రేంద్రః ప్రహృష్టే నాన్తరాత్మనా
ఉవాచ రాఘవం వాక్యం వినయావనతం తథా॥

తా॥ ఆ రీతిగ రామునిచే పూజింపబడినవాడై బ్రాహ్మణోత్తముడగు నగస్త్యుడు సంతోషముతో నిండిన హృదయముకలవాడై వినయ వినమితగాత్రుడగు రామునితో నిట్లనెను:

శ్లో॥ ధన్యోఽసి కృతకృత్యోఽసి య స్త్వయా రావణో హతః
జానకీ చ మహాభాగ సంప్రాప్తా రావణాలయాత్ ॥

తా॥ ఓ రామా నీవు ధన్యుడవైతివి, కృతకృత్యుడవైతివి. ఏలనన నీచే రావణుడు సంహారింపబడెను. ఓ మహానుభావా ! రావణ నిలయమునుండి జానకి తీసికొని రాబడెను.

శ్లో॥ పాలితం గురువాక్యంచ ప్రాప్తం రాజ్య మకంటకం
తద్భుంక్ష్వ రాఘవ శ్రీమాన్ పితృపైతామహం మహత్।

తా॥ గురువగు వశిష్ఠుని వాక్యము లేదా తండ్రియగు దశరథ వాక్యము నెరవేర్చబడినది. ప్రమాదరహితమగు రాజ్యము సంపాదించబడినది. కావున శ్రీమంతుడవగు శ్రీరామచంద్రా! గొప్పదగు నీ పితృపితామహుల సంపదను హాయిగ ననుభవింపుము.

శ్లో॥ ఇత్యుక్తవంతం వచన మగస్త్యం మునిసత్తమం
ప్రత్యువాచ నతో భూత్వా వాక్యజ్ఞో వాక్యముత్తమమ్॥

అని మాటలాడు మునిశ్రేష్ఠుడగు నిగస్త్యునితో మాట నేర్పరి యగు హనుమంతుడు మంచి వాక్యములతో నిట్లు సమాధానమిచ్చెను:

శ్లో॥ స్సంప్రాప్తం భగవ న్నేత త్సర్వం భగవదనుగ్రహాత్
చతుర స్యాంజనేయస్య సాహాయ్యకరుణా దపి ॥

తా॥ ఓ మహాత్మా! ఇదియంతయు నీ యనుగ్రహము నను అట్లే సర్వసమర్థుడగు ఆంజనేయుని సహాయ కరుణల వలనను లభించినది.

శ్లో॥ నచ తుల్యో హనుమతా శౌర్యేణ చ బలేన చ
సౌహార్దేన చ ధైర్యేణ స్వామివిశ్వాసనేన చ॥

తా॥ శౌర్యమునందుకాని, బలమునందుకాని, స్నేహము మునందుకాని, ధైర్యమునందుకాని, స్వామివిశ్వాసమునందు కాని హనుమంతునితో సమానులగువారు లేరు.

శ్లో॥ యతినా ప్రాప్తి రస్మాకం పునర్బంధుసమాగమః
రాజ్యలాభోఽపి న స్వస్తః హనుమ న్మతివైభవాత్ ॥

చతుశ్చత్వారింశ త్పటలః

తా॥ నేను మరల బంధువులను కలియుట, రాజ్య లాభము అనునవి మాకు హనుమంతుని బుద్ధిసంపద చేత చేకూరినవియే

శ్లో॥ త దధీన మిదం సర్వం య చ్ఛుభం భావి భూయ తే
బహు నా త్ర కిము క్తేన స ఏ వాహం న సంశయః ॥

తా॥ వర్తమాన శుభముకాని, కలుగబోవు శుభములు కాని అన్నియు అతని వలన నేర్పడునవే. ఇంతేగా చెప్పనేల! అతడే నేను. ఇందు సందియ మొంతయును లేదు.

శ్లో ఏవం బ్రువన్తం రాజేంద్రం సత్యసంధం తపోధనః
సంతోష్య చ పునః ప్రాహ హనుమద్విషయాం కథామ్॥

తా॥ ఇట్లు చెప్పెడి మాటలకు తపోధనుడగు అగస్త్యుడు సంతోషించి రాజశ్రేష్ఠుడు సత్యమే పల్కువాడునగు రాముని హనుమంతునకు సంబంధించిన కథను చెప్పుమని యడిగెను.

అగస్త్యః

శ్లో॥ యస్య జ్ఞాతుం త్వయా వీర శౌర్యం సాహస భూషితం
త దేవ స కపీన్ద్రస్య కి న్త్వజ్ఞాతం చ విద్యతే ॥

తా॥ అగస్త్యు డడుగుచున్నాడు. ఓ వీరుడవగు శ్రీరామా! నీచే వినదగునట్టిది, ఆ హనుమంతుని శౌర్య సాహసములతో కూడినట్టిది ఇంతకు పూర్వము తెలియబడని ఆ వానర వీరుని కథను చెప్పవలసినది.

శ్లో॥ భిద్యంతే శ్రవణా ద్యై శ్చ భీరూణాం హృదయాని వై
ధీరాణాం హృదయా న్యాశు ప్రాపు న్వ న్త్యభిధీయతామ్ ॥

తా॥ ఏ కథను వినుటచే పిరికివారల గుండెలు బ్రద్ద

లగునో, ఏ కథలు ధైర్యశాలుల హృదయమును వెంటనే చేరునో అట్టివానిని చెప్పవలసినది.

శ్లో॥ రావణేన సమం యుద్ధే యుధ్యమానస్య తే కపిః
సానుజస్య ససైన్యస్య వాలప్రాకార మాతనోత్ ॥

తా॥ యుద్ధమున రావణునితో పోరుసంకర్భమున ఆ హనుమంతుడు సోదరునితోను, సైన్యముతోను కూడిన నీకు తోకతో ప్రాకారము నిర్మించెను.

శ్లో॥ అంతర్ధాయ ససైన్యస్త్వాం మారుతి ర్భీమవిక్రమః
ద్వారమాత్రం బిలం కృత్వా తస్థౌ దౌవారికో బలీ ॥

తా॥ అట్లు నిన్ను, నీ సైన్యమును కనపడనీక గొప్ప పరాక్రమవంతుడగు హనుమంతుడు ద్వారమాత్రముగ మాత్రము అవకాశముంచి ద్వారపాలకునివలె నిలచెను.

శ్లో॥ తదా హ్యజేయంత్వాం మత్వా రావణః పరమాతురః
మైరావణం సమాసాద్య వచనం చేద మబ్రవీత్ ॥

తా॥ అప్పుడు రావణుడు నిన్ను జయింప నలవి కాదని తలంచి మిక్కిలి ఆందోళనతో మైరావణుని కడకు చేరి ఇట్లనెను.

శ్లో॥ అయం రామో మహాబాహుః సర్వశత్రు విమర్దనః
అస్యాంరాత్ర్యాం వ్యతీతాయాం సబలం మాంహనిష్యతి॥

తా॥ ఆజానుబాహువు, శత్రుసర్వస్వమును నాశనము చేయగలవాడు నగు ఈ రాముడు ఈ ఒక్క రాత్రి గడచి నచో నన్ను, నా బలగమును చంపివేయగలడు.

శ్లో॥ హనూమా నపి వాలేన సేనాం సంవేష్ట్య సంస్థితః
తస్మా త్కే నా ప్యుపాయేన వంచయిత్వాథ మారుతిమ్॥

ఆ హనుమంతుడు తోకతో సేననంతను చుట్టి రక్షించు చున్నాడు. కావున ఏ యుపాయమునేతనైన హనుమంతుని మోసముచేసి,

శ్లో॥ సంగృహ్య త్వరయా వీర భ్రాతరౌ రామలక్ష్మణౌ
పాతాళ లంకాం గచ్ఛస్వ తదా సమ్య గ్భవే న్మమ ॥

తా॥ వెంటనే రామలక్ష్మణులను తీసికొని పాతాళ లంకకు వెళ్ళవలెను. ఓ మైరావణవీరా! నాకప్పుడే మేలగును.

శ్లో॥ త్వంహిమాయావతాం శ్రేష్ఠః మమ ప్రాణప్రియ స్సఖా
త్వం యేదానీం హి కర్తవ్యం సాహాయ్య మరిమర్దన ॥

తా॥ నీవు మాయ లొనర్చుటలో మేటివి. నాకు ప్రాణసమానుడవగు మిత్రుడవు. ఓ శత్రువుల నాశనమొనర్చ గలిగినవాడా! నీచే నిప్పుడీ సాయము చేయదగినది,

శ్లో॥ ఏవ ముక్త స్తథా తేన రావణేన దురాత్మనా
మైరావణః ప్రత్యువాచ మాయావా నసురోత్తమః ॥

తా॥ ఈ రీతిగా దురాత్ముడగు రావణునిచే చెప్ప బడినవాడై మాయావియగు రాక్షస శ్రేష్ఠుడైన మైరావణు డిట్లు బదులుపల్కెను:

శ్లో॥ధన్యోఽస్మ్యహం మహారాజయత్త్వయాప్రార్థితోఽధువా
మమ జీవనహేతో ర్వా ఫలం సంప్రాప్త మద్యవై ॥

తా॥ ఓ మహారాజా ! నీవీ రీతిగ నిప్పుడు ప్రార్థించుటవలన నేను ధన్యుడనై తిని నా జీవనమునకు హేతువగు ఫలము నేడే సంప్రాప్తమైనది.

శ్లో॥ యత్త్వయా లోకనాథేన త వాత్మప్యతిథీ త్వయా
త్వ దీప్సిత మకార్యం వా కార్యం వా కర్తు ముత్సహే॥

తా॥ లోకనాథుడవగు నీచే నిట్లడుగబడినది. నీవు కోరినది చేయదగనిదైనను, చేయదగినదైనను చేయుటకు ఉత్సాహపడెదను.

శ్లో॥ భవన్త మర్థినం ప్రాప్య ప్రాణైః పంచభి ర ప్యహం
పూజయిష్యే మహాబాహో ప్రాణా జన్మని జన్మని ॥

తా॥ ఓ మహామహుడా! నీవంటి అర్థినిపొంది పంచ ప్రాణములతో నైనను జన్మ జన్మలందును పూజింతును.

శ్లో॥ యది జీవన్కరిష్యామి సర్వథా త్వద భీప్సితం
కీర్తి కామస్య మే నూనం ప్రాణలాభో పరోమతః ॥

తా॥ బ్రతికియుండగ నీవు కోరినదానిని నెరవేర్చనచో కీర్తికాముడనగు నాకు తప్పక ప్రాణలాభము చేకూరును.

శ్లో॥ ఇదం కార్యం నకుర్యాంచేత్ మయాకింస్యాత్తవ ప్రభో!
అయశో మమ భూయ స్స్యాత్ తవ కార్యం న హన్యతే॥

తా॥ ఈ మాత్రపు పనిని చేయకున్నచో ఇక నావలనకు ప్రయోజనమేమియుండును ? నాకందువలన మిక్కిలి అపకీర్తి సంభవించును. నీ కార్యము ఆగదు.

శ్లో॥ తద్గశ్చ దశకంఠ త్వం స్వస్థో భవ మహామతే ।

తా॥ కావున ఓ బుద్ధిశాలీ ! రావణా ! నీవు వెదలుము. సంతృప్తిగ నుండుము.

శ్లో॥ తస్య త ద్వచనం శ్రుత్వా రావణో రాక్షసాధిపః
మైరావణం పరిష్వజ్య ముమో చానందజం జలమ్ ॥

తా॥ అను మైరావణునిమాటలనువిని రాక్షసనాయకుడగు మైరావణుని కౌగలించుకొని ఆనందబాష్పముల రాల్చెను.

శ్లో॥ తత స్స్వస్థో మహారాజః రాఘవం సమచిన్తయన్
రథేన జవనాశ్వేన తూర్ణ మన్తఃపురం యయౌ ॥

తా॥ పిమ్మట రాజగు రావణుడు స్వస్థచిత్తుడై రామునిగూర్చి యాలోచించుచు వేగముగల గుఱ్ఱములు పూన్చిన రథముపై అంతఃపురమునకు వెడలెను.

శ్లో॥ ఏవం సమాధాయ దశాననం తథా
ప్రసక్త యుద్ధం రఘువంశ కేతునా
మైరావణః ప్రావిశ దాత్మనో గృహం
నిశాచరాధిష్ఠిత మప్రమేయమ్ ॥

తా॥ ఇట్లు రామునితో యుద్ధమొనర్చుటయందు నిష్ఠుడగురావణుని సమాధానపరచి మైరావణుడు రాక్షసగణముతో నిండి సాటిలేనిదగు తన గృహమున జొచ్చెను.

శ్లో॥ తత్ర సూచీముఖం నామ రాక్షసం భీమదర్శనం
దృష్ట్వా వాక్య ముపా చేదం బహుమాన పురస్సరమ్ ॥

తా॥ అచ్చట భయంకరాకారము గల సూచీముఖు

డను పేరుగల రాక్షసుని చూచి గౌరవ పురస్సరముగ నిట్లు పల్కెను:

మైరావణః—

శ్లో॥ సూచీముఖ మహాబాహో! దేవదానవ దుర్జయ।
కర్తవ్య మద్య కార్యం నః దుష్కరం దేవదానవైః॥

తా॥ మైరావణుడు పల్కుచున్నాడు: ఓ మహా బాహూ! దేవతలకును రాక్షసులకును జయింప నలవికాని వాడా! సూచీముఖుడా! దేవదానవులుకూడా చేయలేని కర్తవ్య మొకటి మన కేర్పడినది.

శ్లో॥ హితైషిణా త్వయా నూనం సుకరం లోకవిశ్రుతం
సేనాం వానరవీరాణాం లంకాయాం స ముపస్థితామ్
మారుతి స్తాం స వాలేన వేష్టయిత్వా వ్యవస్థితః॥

తా॥ అది హితమునుకోరు నీచే చేయదగియుండుట, నీకు సుకరమగుటయు లోక విదితమగు విషయము. లంకయందు వచ్చియున్న వానర సేనను ఆంజనేయుడు తన తోకను ప్రాకారముగ చుట్టి కాపాడుచుండెను.

శ్లో॥ తతః ప్రవేశః ప్రాకారే వాయో రపి సుదుర్లభః
అన్యేషాం కిము వక్తవ్యం నర కిన్నర రాక్షసామ్॥

తా॥ ఆ ప్రాకారమునందు ప్రవేశించుటకు వాయువు కైనను దుర్లభము. ఇక నరుల విషయము, కిన్నరుల విషయము, రాక్షసుల విషయము చెప్పవలసిన దేమున్నది?

శ్లో॥ త్వన్తు సూచీముఖ శ్శూర ఉపాయకుశల స్తథా
సూచీముఖేన భూమిం త్వం ఖనిత్వా ఖనకోత్తమ ।
సేనానివేశం ప్రజహి ప్రాకారాన్తర వర్త్మనా ॥

తా॥ శూరుడవగు ఓ సూచీముఖా! నీవైనచో ఉపాయములందు నేర్పరివి. ఓ త్రవ్వకపుమేటీ! నీవు సూదివంటి నీ ముఖముతో భూమిని త్రవ్వి ప్రాకారములోనుండి సేనా నివేశమును చేరుము.

శ్లో॥ విచింత్య సత్వరం తత్ర శయానౌ రామలక్ష్మణౌ
పేటికాయాం ప్రతిష్ఠాప్య సంగృహ్యాగచ్ఛ యత్నతః ॥

తా॥ వెంటనే అచ్చట శయనించియున్న రామలక్ష్మణులను పెట్టెయందు పెట్టుకొని జాగరూకుడవై తీసికొని రమ్ము.

శ్లో॥ కృతకృత్యం తదా యాన్తం
దృష్ట్వా త్వాం హృష్టమానసః
తవ సర్వాణ్యభీష్టాని
దదామి ధృతవిక్రమ ॥

తా॥ అట్లు తీసికొని వచ్చిన కృతకృత్యుడవగు నిన్ను చూచి సంతసించినవాడనై అప్పుడు నీ సమస్తములైన కోర్కెలను తీర్చెదను.

శ్లో॥ ఇతి మైరావణ ప్రోక్తో ముహు స్సూచీముఖోఽసురః
తన్నత్వా ప్రయయౌ సేనాం రామలక్ష్మణ పాలితామ్॥

తా॥ అని మైరావణునిచే పలుమార్లు చెప్పబడిన సూచీముఖ రాక్షసుడు మైరావణునకు నమస్కరించి రామ లక్ష్మణులచే పాలింపబడు సేనను గూర్చి వెడలెను.

శ్లో॥ స ఖనిత్వా ముఖేనైవ సేనాముఖ వసుంధరాం
కపీన్ద్రవాల ప్రాకార స్పర్శా ద్భగ్న ముఖోఽభవత్ ॥

తా॥ వాడు సేనయున్న భూభాగమున తన ముఖము తోనే త్రవ్వనారంభించ ఆంజనేయుని తోకతో నేర్పరుప బడిన ప్రాకారము తగులుటచే ముఖము బ్రద్దలయ్యెను.

శ్లో॥ సూచీముఖో లజ్జితస్సన్ ప్రాప మైరావణాన్తికం
వినమ్రవదనం దీనం ముఖభంగా ద్విపర్చలే
సూచీముఖం సమాలోక్య ప్రాహ మైరావణో వచః ॥

అంత సూచీముఖుడు సిగ్గుపడి మైరావణుని సమీపము నకు వచ్చెను. శత్రుబలమునందు ముఖము బ్రద్దలగుటచే దీనుడై తలవంచియున్న సూచీముఖుని చూచి మైరావణు డిట్లనెను:

శ్లో॥ సూచీముఖ వికారోఽయం కథం జాత స్తవాననే
సత్య మేతం హి వృత్తాంతం సర్వం మే వక్తు మర్హసి॥

తా॥ ఓ సూచీముఖా ! నీ ముఖమునం దీ వికార మెట్లు కల్గినది ? సత్యమగు నా వృత్తాంత మంతను నాకు వినిపించవలసినది.

శ్లో॥ మైరావణ మహాప్రాజ్ఞ ! తవాజ్ఞాం శిరసా వహాన్
గతోఽస్మి రామసేనాం త ద్వాలప్రాకార వేష్టితామ్ ॥

తా॥ ఓ మహామహుడా, మైరావణా! నీ యాజ్ఞను శిరసావహించి ఆ వాలముచే ప్రాకారము చేయబడియున్న రాముని సేనకడకు పోతిని.

శ్లో॥ సూచీముఖ ప్రవృత్తోఽస్మి దృష్ట్వా ప్రాకారభిత్తికాం
ఖనితుం ముఖతుండేన వజ్రాశనిసమ త్విషా ॥

తా॥ అట ప్రాకారముయొక్క ఏ గోడను చూచినా సూదితో సమానమై వజ్రాయుధమువలెనుండి మెరుపు కాంతి గల ముఖముతో త్రవ్వుట మొదలెట్టితిని.

శ్లో॥ ప్రాకారీకృత వాలాగ్ర రోమస్పర్శా ద్ధనూమతః
ముఖభంగోఽభవత్సద్యః పాహి మాం కరుణానిధే ॥

తా॥ ప్రాకారముగా చేయబడిన హనుమంతుని తోక చివరి భాగముననున్న రోమము తాకుటతో వెంటనే ముఖము చిట్లిపోయెను. ఓ దయామయా! నన్ను కాపాడవలసినది.

శ్లో॥ ఏవం సూచీముఖః ప్రోక్త్వా బాష్ప గద్గదకంధరః
పపాత పాదయో స్తస్య పశ్యతాం సర్వరక్షసామ్ ॥

తా॥ ఇట్లు బాష్పముచే గద్గదితమగు కంఠము కల్గి విషయమును చెప్పినవాడై సూచీముఖుడు రాక్షసులందరు చూచుచుండ మైరావణుని పాదములపై బడెను.

శ్లో॥ పతితం తు సముత్థాప్య స్వబాహుభ్యాం బహుప్రదః
తస్య దుఃఖం మమార్జాశు సమ మశ్రుజలేన సః ॥

తా॥ అట్లు పాదములపై బడినవానిని లేపి కౌగలించుకొని అతని దుఃఖమును కన్నీటితో బాటు తుడిచివైచెను.

శ్లో॥ మైరావణో మహామాయాక్రోధావిష్టతను స్తథా
అబ్రవీ మూషికముఖం అతిమాయావిశారదమ్ ॥

తా॥ మహామాయయొక్క కోపముచే ఆవరింపబడిన దేహముగల మైరావణుడు మిక్కిలి మాయలు నేర్చియున్న మూషికముఖునితో నిట్లనెను :

శ్లో॥ రామలక్ష్మణయో స్సేనాం గచ్ఛశీఘ్రం దురాసదాం
యేన కేనా ప్యుపాయేన గృహీత్వా రామలక్ష్మణౌ
ఆగచ్ఛ మ త్సమీపం త్వం అర్ధ రాజ్యం దదామి తే ॥

తా॥ నీవు వెంటనే రామలక్ష్మణుల సేనయున్న చోటికి పొమ్ము. ఏదో రీతిగ నుపాయముతో రామలక్ష్మణులను పట్టుకొని నా కడకు రమ్ము. అట్లగుచో నీకు అర్ధరాజ్యమును ఇచ్చెదను.

శ్లో॥ మైరావణస్య వచనం శ్రుత్వా తన్మూషికాననః
ఆపాతాళం ఖనిత్వోఽహం భూమిస్థౌ రామలక్ష్మణౌ ॥

తా। అను మైరావణుని వచనములు విని ఆ ఎలుకమూతి రక్కసి ఓ మైరావణా! పాతాళమునుండి త్రవ్వి భూమిపై పడుకొనియున్న రామలక్ష్మణులను

శ్లో॥ ఆనయిష్యే మహాప్రాజ్ఞ నీత్వా కాశకృతాశ్రయా
ఇత్యుక్త్వా మూషకముఖః ప్రయయౌ తచ్చమూంప్రతి॥

రెల్లుపై పడుకొనియుండు వారిని ఓ మహానుభావా! నీకడకు తీసికొనివత్తును. అని ఆ మూషకముఖుడు వానర సేన వైపు వెడలెను.

శ్లో॥ ఉన్నతం బ్రహ్మలోకాచ్చ వజ్రతుల్యం మహాజసం
దృష్ట్వా శ్రీహనుమ ద్వాల ప్రాకారం మూషకాననః ॥

తా॥ బ్రహ్మలోకముకంటె నున్నతమై వజ్రమువలె కఠినమైన హనుమంతుని తోకతో చేయబడిన ప్రాకారమును మూషకముఖుడు చూచి-

శ్లో॥ కథం ను వాలప్రాకార ప్రాన్తరం ప్రవిశా మ్యహం ।
ద్రక్ష్యామి వా కథం సుప్తౌ తత్రస్థౌ రామలక్ష్మణౌ ॥

తా॥ తనలో నిట్లనుకొనెను: నేను వాలప్రాకారము లోపలకెట్లు ప్రవేశింతును? అచ్చట నిద్రించుచున్న రామ లక్ష్మణుల నెట్లు చూతును ?

శ్లో॥ కథం ను వా పున ర్యాయాం ఇతి చిన్తావరోఽభవత్
తత్రాపి చ మహావజ్ర వాలం దృష్ట్వాద్భుతం యయౌ ॥

తా॥ ఎట్లు మరల తిరిగివత్తును అనుచు అట వజ్ర కఠోరమగు ఆ వాలమును చూచి మిక్కిలి ఆశ్చర్యమందెను.

శ్లో॥ అనన్తరం ముఖేనైవ దృఢం వాల మతాడయత్
అత్యుగ్ర హనుమద్వాల స్పర్శనేన మహామునే!
మూషకానన దైత్యస్య ముఖభంగోఽభవత్తదా॥

తా॥ పిమ్మట తన ముఖముతో దృఢమగు హనుమంతుని తోకను కొట్టెను. ఓ మైత్రేయ మహామునీ ! గొప్ప దగు నా హనుమంతుని తోకయొక్క స్పర్శచేతనే అప్పుడు మూషకముఖుడగు ఆ రాక్షసుని ముఖము బ్రద్దలయ్యెను.

శ్లో॥ తత్కాలే మూషకముఖః చింతాక్రాంత పరాఙ్ముఖః
దుఃఖితో మూషకముఖః ప్రాప మైరావణా న్తికమ్ ॥

తా॥ ఆ సమయమున మూషకముఖుడు విచార మగ్నుడై వెనుదిరిగెను. అట్లు దుఃఖించుచు మూషకముఖుడు మైరావణుని సమీపమును పొందెను.

శ్లో॥ మైరావణోఽపి తం దృష్ట్వా వికృతం మూషకాననం
కోపావిష్ట మనస్కస్స న్కంచి త్క్రూరం మహాసురమ్॥

తా॥ మైరావణుడా వికృతరూపమునందిన మూషకాననుని చూచి మిక్కిలి కోపమూవహించిన మనస్సు కలవాడై ఒకానొక క్రూరుడగు మహారాక్షసుని.

శ్లో॥ త మువాచ మహాఘోరం నామ్నా పాషాణభేదినం

తా॥ మహాఘోరమగు చర్యలు కలవానిని పాషాణ భేదియను పేరుకలవానిని చూచి ఇట్లనెను :

శ్లో॥ పాషాణభేదీ మాయావీ ధీరోదాత్త మహాబలః
సకలోపాయ చతుర స్త్వమేవ రిపుమర్దనః ॥

తా॥ పాషాణములను భేదింపగలవాడవు. మాయ తెరిగినవాడవు. ధీరోదాత్తుడవు, మహాబలవంతుడవు. అన్నియుపాయములందును సమర్థుడవు. అట్టి నీవే శత్రువుల జయింపజాలినవాడవు.

శ్లో॥ భవిష్యన్తి శిలాభంగాః త్వద్దేహ స్పర్శమాత్రతః

తా॥ నీ దేహమును తాకుటవలననే రాళ్ళు పగిలిపోవును.

శ్లో॥ అతస్త్వం హనుమద్వాల సాలం నిర్భిన్న యత్నతః
సేనా మధ్యగతౌ రామ లక్ష్మణౌ శీఘ్ర మానయ ॥

తా॥ కావున నీవు హనుమంతుని తోకతో ఏర్పాటు చేయబడిన ప్రాకారమును భేదించుయత్నముతో సేనమధ్య నున్న రామలక్ష్మణులను వెంటనే తెమ్ము.

శ్లో॥ ఏవ ముక్త స్స పాషాణ భేదీ కపిచమూం యయౌ
తత్ర గత్వా థ హనుమ ద్వాలసాల మహోన్నతమ్
శిరసా తాడయామాస కుపితో మానవాశనః ॥

తా॥ ఇట్లు చెప్పబడి ఆ పాషాణభేది కపిసేనకడకు నెడలి యచ్చట హనుమద్వాల ప్రాకారమును మహోన్నత ముగుదానిని చూచి కోపమందినవాడై మనుజుల భుజించు వాడగు ఆ పాషాణభేది తన తలతో ఆ ప్రాకారమును బాదెను.

శ్లో॥ పాషాణ భేదీ హనుమద్వాల స్పర్శనమాత్రతః
తదా భంగశిరస్క స్సన్ ప్రాప మైరావణాన్తికమ్ ॥

తా॥ హనుమంతుని తోక తగిలినంతనే తల పగిలి ఆ పాషాణభేది మైరావణుని చెంతకు వచ్చెను.

శ్లో॥ మైరావణో భగ్నదేహం దృష్ట్వా పాషాణభేదినం
రోషపూరిత చిత్త స్సన్ మాయామన్య మచిన్తయత్ ॥

తా॥ మైరావణుడా భగ్నదేహుడగు పాషాణభేదిని చూచి కలుషిత మనస్కుడై మాయాసమాలోచన మొన ర్చెను.

శ్లో॥ విభీషణస్య వేషేణ ధృత్వా సిద్ధక్రియాం కరే
మైరావణో మహామాయీ రామలక్ష్మణయోశ్చమూమ్ ॥

తా॥ విభీషణుని వేషము ధరించి మహామాయావి యగు మైరావణుడు రామలక్ష్మణులకు సంబంధించిన సేన కడకు సిద్ధౌషధులను చేతబూనినవాడై -

శ్లో॥ గత్వా తత్ర మహావాల ప్రాకారద్వార సంస్థితం
హనూమంతం మహాత్మానం దృష్ట్వా విస్మయమానసః
హనూమ న్నికటం ప్రాప తదా మాయా విభీషణః ॥

తా॥ వెడలి అచ్చట మహావాల ప్రాకారద్వారము కడనున్న మహామహుడగు హనుమంతుని చూచి అచ్చెరు వంది మాయా విభీషణుడగు ఆ మైరావణుడు హనుమత్సమీ పమునకు జేరెను.

శ్లో॥ అస్యాం రాత్ర్యాం మహావీర హనూమ న్మారుతాత్మజ
మహామాయావినో దైత్యాః మదాన్ధా స్సన్తి భూరిశః ॥

తా॥ ఓ మహావీరుడా! వాయుకుమారా! ఆంజ నేయా! ఈ రాత్రివేళల మహామాయలుకల రాక్షసులు మదాంధులై అంతట సంచరించుచుందురు.

శ్లో॥ తిష్ఠ చావహితో భూత్వా హతస్వాపో జితశ్రమ
ప్రాకార ద్వాదశీమాయాం నిస్సీమ బలసంయుతః

తా॥ నీవు జాగరూకుడవై నిద్ర, అలసటలను వీడి ప్రాకారద్వారప్రదేశమున అపరిమితమగు బలమున కాచి యుండుము.

శ్లో॥ అహంతు రాఘవౌ ద్రక్ష్యే శయనౌ పర్ణసంస్తరే
అన్తరం దీయతాం తాత మాభూ త్కాలవిపర్యయః ॥

తా॥ నేను ఆకులు పరుచుకొని పడుకొనియున్న రఘు నందనులగు రామలక్ష్మణులను చూచివత్తును. కావున ఆల స్యించక నేను లోనికి పోవు నవకాశ మీయవలసినది.

శ్లో॥ క్షణాదేవ గమిష్యామి పున ర్జాగృహి మారుతే
ఇతి వాదిని దైత్యేంద్రే విభీషణసమాకృతౌ ॥

తా॥ క్షణములో తిరిగివచ్చెదనుకాన మెలకువగనుండ వలసినది అని విభీషణుని ఆకారముననున్న రాక్షసరాజగు మైరావణుడు చెప్పగా

శ్లో॥ అబ్రవీ న్మారుతి స్స్నేహా న్మైరావణ విభీషణం
ఊరుద్వయాంతర పథా సేనాం ప్రవిశ మే సఖే ॥

తా॥ హనుమంతుడు స్నేహావశమున విభీషణుని రూపుననున్న మైరావణునితో నిట్లనెను: 'ఓ స్నేహితుడా! నా తొడలమధ్యగ సేనలోనికి ప్రవేశింపుము' అనగా-

శ్లో॥ మైరావణో మహామాయీ విభీషణ ఇ వాచరన్
తథేతి ప్రావిశ త్యేన కపీంద్రోర్వ న్తరాధ్వనా ॥

తా॥ మహామాయావియగు మైరావణు డట్లేయని విభీషణునివలెనే చరించుచు హనుమంతుని తొడల మధ్య నున్న మార్గమున ప్రవేశించెను.

శ్లో॥ మాయావిభీషణో దృష్ట్వా శయానౌ రామలక్ష్మణౌ
తయో రుపరి చిక్షేప సిద్ధౌషధి వనస్పతీన్ ॥

తా॥ ఆ మాయా విభీషణుడు శయనించియున్న రామ లక్ష్మణులను చూచి వారిపై తాను తెచ్చిన సిద్ధౌషధులను చల్లెను.

శ్లో॥ తదోషధి ప్రభావేన మూర్ఛితౌ రాఘవౌ తదా
పేటీమధ్యే వినిక్షిప్య వస్త్రేణాచ్ఛాద్య యత్నతః

తా॥ ఆ ఓషధిప్రభావమువలన రామలక్ష్మణులు మూర్ఛనొందగా నప్పుడు మాయతో వారిని ఒక పెట్టెయందుంచి దానిపై వస్త్రమును కప్పెను.

శ్లో॥ కక్షే కృత్వా మహాకాయః పునరేవాభ్యగాత్కపిం
తమాగతం కపీన్ద్రోఽపి పప్రచ్ఛ కుశలం తయోః ॥

తా॥ ఆ పెట్టెను మైరావణుడు తన చంకలో పెట్టుకొని మరల హనుమంతుని చేరెను. వానిని చూచి మారుతి రామలక్ష్మణుల కుశలము గూర్చి యడిగెను.

శ్లో॥ తేన పృష్టో మహామాయ సర్వత్ర క్షేమ మబ్రవీత్
పునరేవాబ్రవీ న్మాయీ తత్కాలసదృశం వచః ॥

తా॥ అట్లడుగబడి మాయావియగు మైరావణుడు అంతయు క్షేమముగా నున్నారనుచు నింకను సమయోచితముగ నిట్లు మాట్లాడజొచ్చెను :

శ్లో॥ ఆపద్బాంధో కపిశ్రేష్ఠ నానాశాస్త్రాది నైపుణ
అస్యాం రాత్ర్యాం తు ఘోరాయాం రాక్షసాః పాపబుద్ధయః

తా॥ ఓ ఆపద్బాంధవా! వానరవీరా! నానా శాస్త్ర విశారదా ! ఈ ఘోరమగు రాత్రియందు పాపాత్ములగు రాక్షసులు-

శ్లో॥ రంధ్రాణి మృగయంతేఽత్ర సర్వతో బలదర్పితాః
తదిమాం వానరీం సేనాం రామప్రియ చికీర్షయా ॥

తా॥ బలగర్వముతో సంచరించుచు ఇచ్చట కూడ ప్రవేశమునకై యత్నించుచుందురు. కావున రామునకు ప్రియ మొనర్ప నెంచిన నీవీ వానర సేనను

శ్లో॥ పరిపాలయ యత్నేన న పరస్మైదిశాన్తరం
ఇతి తస్మై హితం ప్రోక్త్వా క్షణా త్స్వపుర మన్వగాత్ ॥

తా॥ ప్రయత్నపూర్వకముగ కాపాడుము. వారికి వేరు దిక్కు లేదు అని హనుమంతునకు హితవాక్యములుగా పల్కి క్షణములో మైరావణుడు తన పట్టణము చేరెను.

శ్లో॥ సంగృహ్య ఛద్మనా వీరౌ రాక్షసః పాపకర్మకృత్
కృతకృత్యం తదాత్మానం మేనే మందమతిర్హి సః ॥

తా॥ మాయతో వీరులగు రామలక్ష్మణులను తీసికొని వచ్చియు ఆ పాపాత్ముడు మందమతియగుటవలన తనను తాను కృతకృత్యునిగ తలచెను.

శ్లో॥ తదా దదౌ దరిద్రేభ్యః వస్త్రాభరణాని చ

తా॥ అప్పుడు ఆతడట్టి ప్రీతిచే ఒడలుమరచి దరిద్రు లందఱకు వస్త్రములు, ఆభరణములు గొప్పగొప్ప రత్నములు బహుమానములుగా నిచ్చెను.

శ్లో॥ తత్రాహూయ స్వభగినీం దుర్దండీం నామ నామతః
ఆహ మైరావణః ప్రీతో రుద్ధాం కేనచి దాగతామ్ ॥

తా॥ పిదప మైరావణుడు దుర్దండియను పేరుగల తన సోదరిని పిలచి ఆమె రాగా ప్రీతితో నాత డిట్లనెను :

శ్లో॥ ఏహి కల్యాణి భద్రంతే మాభూత్తే మనసో వ్యథా
ఉత్సవో హి మహానద్యాం దుర్గాయా స్సం ప్రవర్తతే॥

తా॥ ఓ కళ్యాణీ! నీకు శుభమగుగాక! నీకు మానసిక బాధయేమియు కలుగకుండుగాక! దుర్గాదేవికి మహానదియం దుత్సవము జరుగనున్నది.

శ్లో॥ తస్యాః ప్రీత్యై మహామార్యాః మానుషౌ రామలక్ష్మణౌ
కరిష్యామి బలిం నూనం స్థాపయేయం నవోదకైః॥

తా॥ ఆ మహామారి ప్రీతికొరకై ఈ మనుష్యులగు రామలక్ష్మణులను తప్పక బలియిత్తును. అందుకై వీరిని నూత్నజలమున నుంచవలసియున్నది

శ్లో॥ ప్రాకార బాహ్యసరసి తోయ మంబుజ భూషితం
ఆహర స్వర్ణపాత్రేణ గచ్ఛ దుర్దండి రంహసా॥

తా॥ ఓ దుర్దండీ! ప్రాకారము వెలుపలనున్న సరస్సునందు పద్మములచే నొప్పు జలములను స్వర్ణపాత్రతో తెమ్ము. శీఘ్రముగ పొమ్ము.

శ్లో॥ దుర్దండీ తద్వచ శ్రుత్వా దుఃఖితా ఖిన్నమానసా
గృహీత్వా స్వర్ణకలశం జగామ సరసీతటమ్॥

తా॥ దుర్దండి ఆ మాటలువిని దుఃఖమునంది కలత చెందిన మనస్సు కలదై, బంగారుపాత్రను తీసికొని సరస్సునకు వెడలెను.

శ్లో॥ అథ రఘువరయుగ్మ దర్శనోద్యత్
స్ఫుటకరుణారసపూరితాన్తరాత్మా

సుదృఢ మభిజానతీ తదీయాం
సకల శరీరిషు హింసితా రురోద ॥

తా॥ పిమ్మట శ్రీరామలక్ష్మణుల జూచుటచే కరుణా రసముతో నిండిన హృదయముకలదై ఆ దుర్దండి రోదించెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పంచముఖ హనుమద్వివరణే
మైరావణ మాయా ప్రకరణం నామ
చతుశ్చత్వారింశత్పటలః



## పంచచత్వారింశ త్పటలః

## హనుమ త్పాతాళలంకా ప్రవేశ కథనం

శ్లో॥ ఏతస్మిన్నంతరే ప్రాజ్ఞో ద్రష్టుకామ స్స రాఘవౌ
విభీషణ శ్శుభాచారః హనుమన్నికటం గతః ॥

తా॥ ఇంతలో శుభప్రదములగు చేష్టలుకల విజ్ఞాని యగు విభీషణుడు రామలక్ష్మణులను చూడతలచినవాడై హనుమంతుని సమీపమునకు వచ్చెను.

శ్లో॥ తమువాచాథ పౌలస్త్యొ ప్రాకారాకృత వాలధిం
రాక్షసాః పాపకర్మాణః మాయామోహేన పండితాః ॥

తా॥ అంతట ఆ విభీషణుడు ప్రాకారమువలె చుట్టి

బడిన శోకకల హనుమంతునితో నిట్లనెను: ఓ ఆంజనేయా! రాక్షసులు పాపకర్ములు, మాయలు చేయుటయందు పండితులు.

శ్లో॥ వంచకాః పరమక్రుద్ధాః రన్ధ్రాన్వేషణ తత్పరాః
సేనాముఖేచరన్తీహ దృష్ట్యగోచర విగ్రహాః॥

తా॥ ఇంకను మోసగాండ్రు, మిక్కిలి కోపిష్ఠులు, అవకాశముకొరకై ఎప్పుడు వెదకుచుండువారు. అట్టివారు కనులకు కన్పడకుండ ఈ మన సేనముందే సంచరించుచున్నారు.

శ్లో॥ గృధ్రా ఇవ చరన్త్యన్యే కేచిద్గార్దభ విభ్రమాః
కిన్త్విదానీం కపిశ్రేష్ఠ శృణుష్వైకం హితం వచః ॥

తా॥ కొందరు గ్రద్దవంటి ముఖములతోను, కొందరు గాడిదవలె నుండియు తిరుగుచున్నారు. ఓ వానరవీరా! ఇప్పుడు నేనొక మేలగుమాట చెప్పుచున్నాను వినవలసినది-

శ్లో॥ ఏషా భగవతీ రాత్రీ సుప్రభాతా స్ఫుటం యది
తదాస్యాతాం రాజపుత్రౌ కృతార్థౌ రామలక్ష్మణౌ॥

తా॥ ఈ రాత్రి గడచి చక్కగ తెల్లవారినచో అప్పుడీ రాజకుమారులగు రామలక్ష్మణులు ధన్యులు.

శ్లో॥ దీర్ఘనిశ్వాస కల్లోలం తరేతాం దుఃఖసాగరం
వయంచ కృతినస్సర్వే ప్రాణై రపి హి తైర్హీనాః॥

తా॥ దీర్ఘమగు నిశ్వాసలతో కలతపడియున్న ఈ దుఃఖసముద్రమును వారిర్వురును దాటుదురుగాక! ప్రాణ

ములకంటెను లధికముగా వారి క్షేమముకోరు మనముకూడ అప్పుడే కృతకృత్యులమౌదుము.

శ్లో॥ త్వయా హనుమన్వీర నకర్తవ్యా ప్రమత్తతా
త్వదధీనమిదం సర్వం బలం సుగ్రీవ పాలితమ్ ॥

తా॥ కావున ఓ వీరుడా! హనుమంతా! నీవు ఏమరు పాటుగా నుండతగదు. సుగ్రీవునిచే పాలింపబడు ఈ సేన సంతయు నీ యధీనమున నున్నది.

శ్లో॥ ధైర్యే బలేచ బుద్ధౌచ సాహసే ప్రియకర్మణి
నాస్తి తే సదృశశ్శూరః త్వంహినః పరమాగతిః ॥

తా॥ ధైర్యమునందు, బలమునందు, బుద్ధియందు, సాహసమునందు, ఇష్టకర్మలందును నీతో సమానుడగు శూరుడు లేడు. నీవేకదా మాకు పరమగతి.

శ్లో॥ నాన్తరం దీయతాం కస్మై సేనాం తస్సర్వతో దిశం
పశ్యేయ మతుల ప్రాజ్ఞౌ రాజపుత్రావరిందమౌ ॥

తా॥ ఎవ్వరికినీ ఈ ప్రాకారమునందు చోటీయవద్దు. సేనయందన్ని దిక్కులను జాగ్రత్తగ చూడదగును. శత్రువుల నణచజాలు, రాజపుత్రులగు ఈ మహనీయులను జాగ్రత్తగ చూడవలెను.

శ్లో॥ కిన్ను సేతే రఘుశ్రేష్ఠః సీతావిరహకాతరః॥
సౌమిత్రిర్వా ధనుష్పాణిః కిన్ను జాగర్తి లక్ష్మణః ॥

తా॥ సీతాదేవి విరహముచే బాధనందియున్న రఘు

రాముడు నిద్రించుచున్నాడా? ధనుష్పాణియగు లక్ష్మణుడు మెలకువతోనున్నాడా?

శ్లో॥ అన్తరం దీయతామ్మహ్యాం దిదృక్షురహమాగతః
ఇతి వాదిని పౌలస్త్యే హితైషిణి విభీషణే॥

తా॥ ఓ హనుమంతా! నాకు కొంచెము అవకాశమీయవలసినది. వారిని చూచుటకై నేను వచ్చితిని. అని హిత కాంక్షియు, పులస్త్య మనుమడు నగు విభీషణుడు పలుకగా-

శ్లో॥ ప్రత్యువాచ కపిశ్రేష్ఠః సంశయాపన్నమానసః
విభీషణ శుభాచార ముహూర్తేహి గతాగతః॥

తా॥ హనుమంతుడు సంశయమునందిన మనస్సు కలవాడై బదులు పల్కెను. ఓ విభీషణా! శుభాచార సంపన్నా! క్షణకాలములోనే వెళ్ళి మరల వచ్చితివి కదా!

శ్లో॥ సందేహయతి మచ్చిత్తం వామాక్షి స్పన్దతే పునః
ఇదానీ మాగతో విద్వాన్ దృష్టవానసి రాఘవౌ॥

తా॥ నా మనస్సు సందేహించుచున్నది. ఎడమకన్ను అదురుచున్నది. ఓ విభీషణా! ఇప్పుడే కదా వచ్చి రామ లక్ష్మణులను చూచితివి!

శ్లో॥ పునరేవాగతః కిన్ను సఖే మే బ్రూహి తత్త్వతః
ఇతి శ్రుత్వా వచో దీనం కపినాథేన భాషితమ్॥

తా॥ మరల వచ్చితివేమిటి? ఓ మిత్రుడా! ఇట్లు వచ్చుటయందు దుద్దేశ్యమును నాకు తెల్పుము అని అతి దీనముగా పల్కు హనుమంతుని మాటలు విని-

శ్లో॥ విభీషణో గతో త్సాహః ముహూర్తం ధ్యానమాస్థితః
విభీషణః పునః ప్రాహ ధైర్యమాస్థాయ యత్నతః ॥

తా॥ విభీషణుడు ఉత్సాహముడిగిపోగా క్షణకాలము నిశ్చేష్టుడై యుండి పిదప ఎట్లో ధైర్యము తెచ్చుకొని ఇట్లనెను :

శ్లో॥ నాగతో ఽస్మి కపిశ్రేష్ఠ న దృష్టౌ రామలక్ష్మణౌ
కిన్తు మైరావణో నామ మాతులో రావణస్య వై ॥

తా॥ ఓ వానరవీరా ! నేను రాలేదు. రామలక్ష్మణులను చూడలేదు. కాని రావణుని మేనమామయగు మైరావణుడను పేరుకలవాడున్నాడు.

శ్లో॥ బహురూపో మహామాయో వంచితాఖిల సజ్జనః
నైచ్యశీలః దురాచారో మమ వేషధరశ్శఠః ॥

తా॥ అతడు పెక్కురూపములు కల మహామాయావి, సజ్జనులనందరను మోసగించినవాడు, నీచమైన శీలము కలవాడు, దురాచారపరాయణుడు, నా వేషమును ధరించువాడు, అన్యులెరుగనట్లు మోసము చేయగలవాడు.

శ్లో॥ వంచయిత్వా భవంతం వై ప్రవిష్టశ్ఛద్మనాబలం
కిన్ను తత్రాకరోన్మాయీ రాజన్యోస్తు ప్రసుప్తయోః

తా॥ నిన్ను మోసగించి మారువేషమున అతడు మన సేనయందు ప్రవేశించినాడు. అచ్చట నిదురించు రామలక్ష్మణుల కేయపకారము గావించినాడో కదా !

శ్లో॥ జానీయ ద్యదితన్మాయీం లక్ష్మణః పరవీరహా
తదైనమసురం సద్యః హన్యతే వా విచారయన్ ॥

తా॥ ఆ మాయామయు నెరిగినచో వీరుడగు లక్ష్మణుడు వెంటనే ఆ రాక్షసుని వేరాలోచించక చంపువాడు.

శ్లో॥ గమ్యతాం తత్రవేగేన యత్రాస్తే రఘునందనః
యావన్నదృశ్యతే రామః న వార్తాం శ్రూయతేఽపివా॥

తా॥ ఎచ్చట శ్రీరామచంద్రుడున్నాడో అచ్చటకు త్వరగా వెళ్ళవలెను. రాముని చూచునంతవరకు, లేదా ఆతని క్షేమవార్త వినునంతవరకు-

శ్లో॥ తావత్సంతప్యతే చేతః వహ్నౌ తప్తమివాయసః
ఇతి సంతప్యమానస్సన్ కపీన్ద్రేణ సమం తదా
రాఘవాధిష్ఠితం దేశం జగామ స విభీషణః॥

తా॥ నా మనస్సు అగ్నిచే కాల్చబడిన ఇనుమువలె మండుచున్నది. అని బాధపడుచు విభీషణుడు హనుమంతునితో కలసి రాముడు విశ్రమించినచోటికి పోయెను.

శ్లో॥ దృష్ట్వా శూన్యంతు తద్దేశం వివర్ణహృదయా వృభౌ
చతురస్త్రత సేనాయాం భూతావేశావివానఘా
వివ్యథే కపిసేనాపి దృష్ట్వా కపి విభీషణౌ॥

తా॥ అచ్చట శూన్యముగానున్న ఆ ప్రదేశముగాంచి వారిరువురు వన్నెదరిగి కలతచెందిన హృదయముకలవారైరి. ఆ సేనయందు దట్లు భూతమావేశించిన రీతిగానున్న హనుమద్విభీషణులను చూచి వానరసేన కూడ బాధపడెను.

శ్లో॥ దృష్ట్వా నవిద్యమానౌ తౌ సుతరాం దుఃఖితోఽభవత్
భిద్యమాన ఇవాంభోధిః మన్దరాద్రిరివ భృశమ్॥

తా॥ అచ్చట రామలక్ష్మణులు లేకుండుటను చూచి నడిసముద్రమున మందరపర్వతము పడినట్లు కలతనొంది హను మంతుడు మిక్కిలి దుఃఖించెను.

శ్లో॥ శుశ్రువేష్టు ర్మహాధ్వానః మహాకారో మహానభూత్
చుక్రుశుర్మిళితా స్తత్ర ముక్తకంఠాః పరస్పరమ్ ॥

తా॥ వారందరి ధ్వనులవలన హాహాకారములు మిక్కిలిగా నయ్యెను. వారందరు పరస్పరము ముక్త కంఠులై ఆక్రోశించిరి.

శ్లో॥ ఇత్యాక్రోశ పరం సైన్యం దృష్ట్వా కేసరినందనః
పపాత భృశ దుఃఖార్తః ఛిన్న మూల ఇవద్రుమః ॥

తా॥ ఇట్లు ఏడ్పులతో నిండిన సైన్యమును చూచి కేసరి సుతుడగు హనుమంతుడు మిక్కిలి దుఃఖము ననుభవించు టచే మొదలు తెగిన వృక్షమువలె పడెను.

శ్లో॥ నవివేద తదా బాహ్యం ముహూర్తం దుఃఖవిహ్వలః
ఉత్థాయ పునరహ్నాయ ధీరోదాత్తో మహాకపిః ॥

తా॥ అప్పుడొక క్షణకాలము బాహ్యమేమియు నెరు గనిరీతి దుఃఖముననుండి ధీరోదాత్తుడగు ఆ వీరాంజనేయుడు లేచి-

శ్లో॥ జాన్వోరుపరిసంస్థాప్య శిర ఆనత కంధరః
చింతయామాస దుఃఖార్తో రామలక్ష్మణయోర్గతిమ్ ॥

తా॥ మెడవంచి తలను మోకాళ్ళపై నుంచి మిక్కిలి

దుఃఖమంది రామలక్ష్మణులగతి గూర్చి విచారించుచుండెను.

శ్లో॥ ధిఙ్మాంకువిక్రమం మూఢం స్వామికార్య వినాశకం
మిత్రద్రోహం వృథాప్రజ్ఞం ధిఙ్మాంకుత్సిత చేష్టకమ్ ॥

తా॥ ఛీ! నానీచమగు పరాక్రమము వ్యర్థము స్వామి కార్యమును నాశనమొనర్చిన నేను మూఢుడను, మిత్రద్రోహిని, వ్యర్థ ప్రజ్ఞగలవాడను, దుష్టచేష్టితుడను.

శ్లో॥ ధిగిమం వాలధిం దీర్ఘం ధిగ్ద్వారికతా మమ
ధిఙ్మతిం స్థూలరూపాం వా ధిగ్జీవన మిదం మమ ॥

తా॥ ఈ పొడవగు తోక వ్యర్థము. నాకు ద్వారిక పదము నిచ్చుట వ్యర్థము. నా స్థూలరూపమగు మందమతి వ్యర్థము. ఈనా జీవితమే వ్యర్థము.

శ్లో॥ యదహం మర్కటో భూత్వా రాజపుత్రావనాశయః
సుగ్రీవః కిన్నుమాం బ్రూయా న్నియోక్తా బలరక్షణే ॥

తా॥ ఎందుకన నేను వానరుడనై రాజపుత్రులను రక్షింపనెంచితిని. అయ్యో! నన్ను రక్షణకార్యమున నియోగించిన సుగ్రీవు డేమనునోకదా!

శ్లో॥ వైదేహీ చేతి మన్యేత సఖ్యమారోప్య వాయుజః
శత్రుపక్ష కృతస్నేహో రామమగ్రాహయత్స్వయమ్ ॥

తా॥ ఈవాయుపుత్రుడగు హనుమంతుడు స్నేహము నటించి శత్రుపక్షమందిష్టముకలవాడై స్వయముగ తానే రాముని అపహరించెనని సీత తలచునుకదా!

శ్లో॥ ఇతి చిన్తాకుల స్వాన్తః వవృధే వాయునందనః
ఆబ్రహ్మ భవనవ్యాప్త విశ్వరూప కళేబరః ॥

తా॥ అని విచారముచే కలతనందినమనస్సుకల్గి వాయుపుత్రుడగు హనుమంతుడు బ్రహ్మలోకమువరకు వ్యాపించెడు విశ్వరూపమైన దేహముకలవాడై పెరిగెను.

శ్లో॥ ప్రళయాగ్ని రివజ్వాలా జజ్వాల బహిరంతరమ్
మృత్యోరపి భయంచక్రే భయంకర ముఖః కపిః ॥

తా॥ భయంకర ముఖము కల హనుమంతుడు ప్రళయాగ్ని సమానమగు జ్వాల లోపల, వెలుపల వ్యాపించ మృత్యుదేవతకును భయము కల్గునట్లొనర్చెను.

శ్లో॥ బ్రహ్మాదయ స్సురాస్సర్వే కౌందిశీకా స్తథా భవన్
ఇత్యుగ్రరూప మాస్థాయ బభాషే స విభీషణమ్ ॥

తా॥ అట్టి అతనిని చూచి బ్రహ్మాది దేవతలందరు భయముతో పరుగులెత్తిరి. ఇట్లు ఆతడు భయంకరరూపము దాల్చి విభీషణునితో నిట్లనెను:

శ్లో॥ క్వను మైరావణో దైత్యః దర్శయత్వం తదాలయం
సంవేష్ట్య వాలరోమాగ్రైః చూర్ణీకుర్యాం తమశ్మని ॥

తా॥ ఎక్కడ ఆ రాక్షసుడగు మైరావణుడు ? నీవు వాని నిలయమును చూపుము; నా తోక వెంట్రుకల కొనలతోనే వానిని చూర్ణమొనర్తును.

శ్లో॥ అథవా పాదఘాతేన మర్దయిష్యే కృతాగసం
అథవా క్షుధితో నూనం కబళీకుర్యాం ప్రతారకమ్ ॥

తా॥ లేదా పాదఘాతములతో ఆ పాపాత్ముని మర్దింతును. కాకున్న ఆకలిగొన్నవాడనై ఆ మోసగాని కబళముగా నొనర్తును.

శ్లో॥ ఇతి కోప సమాక్రాంత చేతసం విశ్వరూపిణాం
హనూమన్త ముపాచేదం సాన్త్వయన్ సవిభీషణః ॥

తా॥ అని కోపముచే ఆక్రమింపబడిన మనస్సుకల్గి విశ్వరూపము నందియున్న హనుమంతు నూరడించుచు విభీషణుడిట్లనెను :

శ్లో॥ అస్తి పాతాళలంకాయాం మైరావణపురం మహత్
దేవదానవ దుర్ధర్షం సప్తప్రాకార వేష్టితమ్ ॥

తా॥ ఓ హనుమంతా! పాతాళలంకయందు గొప్పదగు మైరావణపురముకలదు. అది దేవతలకు, రాక్షసులకును జయించవీలుకానిదీ; ఏడు ప్రాకారములతో చుట్టబడియుండునట్టిదియును;

శ్లో॥ దుర్గమం పవనే నాపి తతోఽన్యేషాం హి కింపునః
తస్య ద్వారద్వయం చాభూ ద్గత్వా గమనసాధకమ్ ॥

తా॥ అది వాయువునకును చొర వీలుకానిది. ఇక ఇతరులగూర్చి చెప్పునదేమి ! వెళ్ళి వచ్చుచుండుటకు దానికి రెండు ద్వారములుమాత్రమున్నవి.

శ్లో॥ తత్రైకం పద్మినీనాళ విధి రన్తర పద్ధతిః
రావణాంతఃపుర ద్వార కృతవర్త్మా పరం మహత్ ॥

తా॥ అచ్చట తామరపూవు నాళమువంటి మార్గము

కలదు. అది రావణుని అంతఃపురమునుండి కల మార్గము; అది మొదటిది.

శ్లో॥ ద్వితీయేన పథాగన్తుం త్వద్విధానా మ్మహాత్మనాం
ఆయాసోనాస్తి శుద్ధాత్మ న్విపులాయత పర్వణి ॥

తా॥ ఓ శుద్ధాత్ముడా! రెండవదగు వేరొక మార్గమున బోవుటకు నీవంటి మహాత్ములకు కష్టముకాదు. అది విశాలమైన పొడవగు మార్గముకలది.

శ్లో॥ కిన్తు తత్రాన్తరాయ స్స్యా దుద్భటై ర్భటసైనికైః
మహాయుధైః కృతామర్షైః రావణ స్యాన్తరంగికైః ॥

తా॥ కాని అచ్చట గొప్ప ఆయుధములతో మిక్కిలి కోపముకల్గియున్న రావణుని ఆంతరంగికులగు గొప్ప సైనికులు అడ్డు ఉందురు.

శ్లో॥ సంగ్రామోపి భవే దాశు తత స్స్యాత్కార్య విప్లవః
తస్మాత్తేన పథా ధీమన్ గన్తవ్యం హి త్వయాధునా ॥

తా॥ వెంటనే వారితో యుద్ధము చేయవలసి వచ్చును. ఆ కారణమున పనియందు విఘ్న మేర్పడును. కావున ఓ ధీమంతా! ఆ మార్గముగుండా బోవుటకు నీవు ఇప్పుడే బయలుదేరవలెను.

శ్లో॥ ఆద్యేన నాళమార్గేణ యాహి క్షేమాయనః కపే
పాతాళలంకా ప్రాకార బాహ్యపుష్కరిణీతటే ॥

తా॥ ఓ వానరవీరా! మొకటి పద్మినీనాళ మార్గ మున క్షేమముగా వెళ్ళుము. పాతాళలంకయొక్క ప్రాకా రముబయటనున్న కోనేటియొద్దన-

శ్లో॥ మృణాళ సదృశాకార నాళయన్త్రం వినిర్మితం
తదీయ సూక్ష్మమార్గేణ కామరూపాహి రాక్షసాః ॥

తా॥ మృణాళముతో సమానమగు ఆకారముకల నాళ యంత్రము నిర్మింపబడియున్నది. దాని సూక్ష్మమార్గమున కామరూపులగు రాక్షసులు-

శ్లో॥ చరన్తి సంకటే ప్రాప్తే తదిదం గుప్త మశ్మభిః
ఇమ ముద్ధరపాషాణం భృగువర్తుల మక్షతమ్ ॥

తా॥ సంచరించుచుందురు. అక్కడ సంకట మేర్ప డినచో నది పెద్దరాళ్ళతో మూయబడును. ఆ పెద్దదగు, గుండ్రనైన మొక్కవోని రాయిని తొలగించుము.

శ్లో॥ తేనైవముక్తో హనుమన్ చిక్షేపాగ్ర నఖేన తం
తత్ర దృష్టం బిలం సూక్ష్మం తత్ర నాళం వ్యదృశ్యత ॥

తా॥ కొనవ్రేలితో దానిని నెట్టివేసి హనుమంతుడు దానినుండి విడిపించుకొని అచ్చట సూక్ష్మమగు రంధ్రమును చూచెను. అచ్చటనే నాళము కనపడెను.

శ్లో॥ కామరూపో మహాభాగ సూక్ష్మరూపో వ్యజాయత
తత్ర సూక్ష్మ శరీరేణ ప్రవిష్టః ప్లవగాధిపః ॥

తా॥ ఇష్టమైన రూపములెల్ల ధరింపగల హనుమం

తుడు సూక్ష్మమగు రూపము నందెను. అట్లు ఆ వానరవీరు డచ్చట సూక్ష్మదేహము నందియుండెను.

శ్లో॥ అతి సూక్ష్మతయా తస్య భావికార్యేషు సారతః
సంకల్పేచ్చైవ కర్మాణ భూ ద్రిపురేనం యథావధా ॥

తా॥ ముందు చేయబోవు పనులందు అనుకూలముగా శత్రుసంహారమునందలి కష్టమునందు తగునట్లుగా నాతని చర్య అయ్యెను.

శ్లో॥ నిర్గత్య నాళమార్గేణ యయా పుష్కరిణీతటం
అతినందన మాలోక్య సరసీ రామణీయకమ్ ॥

తా॥ నాళమార్గముగుండ వెలువడి కోనేటియొద్దన చేరెను. నందనవనమునుమించు ఆ సరస్సుయొక్క అంద మును చూచి—

శ్లో॥ సస్మారాకృష్ట చిత్తస్సన్ పంపాయాః కమనీయతాం
బహుయోజన విస్తీర్ణాం సరసీం సందిదృక్షయా ॥

తా॥ ఆకర్షించబడిన మనస్సు కలవాడై పంపానది యొక్క మనోజ్ఞతను తనొక్కమారు జ్ఞాపకమునకు తెచ్చు కొనెను. అనేక యోజనముల వైశాల్యముకల ఆ సరస్సును చూడగోరినవాడై

శ్లో॥ అత్యున్నతం తటరుహం ఆరురోహ శమీతరుం
తత్ర కాసార సౌన్దర్య మశేషం తద్విలోక్యసః ॥

తా॥ ఆ యొద్దున మిక్కిలి ఎత్తుగనున్న జమ్మి

చెట్టును ఎక్కెను. ఆ రీతిగా ఆతడు సంపూర్ణమగు ఆ సరస్సౌందర్యమును చూచి-

శ్లో॥ అథవత్పరమానందః కపీంద్రో రమతాం వరః
అథాపశ్యత్పురీం లంకాం సప్తప్రాకార వేష్టితామ్ ॥

తా॥ ఆటలమేటియగు హనుమంతుడు పరమానంద మందెను. పిదప ఏడుప్రాకారములతో చుట్టబడిన పాతాళ లంకను చూచెను.

శ్లో॥ పంచకోశావృతాం విద్యాం బ్రహ్మాఖ్యామివ తాపసః
ఇతి పశ్యన్విచిత్రాణి నాగరాణి బహూన్యపి ॥

తా॥ తాపసులు పంచకోశములచే నావరింపబడు బ్రహ్మవిద్య నెరిగినట్లు ఆ నగరమునందలి అనేకవిధముల చిత్రములను చూచుచు- (పంచకోశములనగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములైదు.)

శ్లో॥ మగ్నస్సన్ పరమానంద సింధౌ నాత్మానమస్మరన్
దుర్దండీ రుదితం ఘోరం శమీతరు సమీపగమ్ ॥

తా॥ పరమానంద సముద్రమున మునిగినవాడై తనను తాను మరచురీతికిరాక ఆ శమీవృక్షముకడకు వినవచ్చిన దుర్దండియొక్క ఘోరమగు ఏడ్పును-

శ్లో॥ దీనస్వరం స సుశ్రావ దీనబంధు ర్దయానిధిః
కిమేత దితి సంచిన్త్య దయార్ద్రో హృదయః కపిః ॥

తా॥ దీనులకు బంధువు, దయకు నిలయము అయిన హనుమంతుడు ఆ దీనస్వరమును వినెను. అట్టి దైన్యమున దయచే కరిగిన హృదయముకల ఆ కపివీరుడు ఇది యేమా? అని ఆలోచించి-

శ్లో॥ అత్యున్నత శమీవృక్షా త్తత్క్షణాదవతతార సః
అవతీర్య శనైర్గచ్ఛన్ దుర్గండీం లాలనోన్ముఖః ॥

తా॥ మిక్కిలి ఎత్తైన ఆ జమ్మివృక్షమునుండి ఆతడు వెంటనే దిగెను. అట్లు దిగి దుర్గండికడకు నెమ్మదిగా వెళ్ళి ఆమె నోదార్చనెంచినవాడై

శ్లో॥ శృంఖలాం భంతియామాస తత్పాదగజ రోధినం
తతః ప్రాహకపీన్ద్ర స్తాం శృంఖలాబంధ విస్మృతామ్ ॥

తా॥ ముందుగా ఆమె నడచుటకు అడ్డముగానున్న సంకెలలను తొలగించెను. అట్లు బంధవిముక్తురాలగు ఆమెతో పిమ్మట హనుమంతు డిట్లనెను :

శ్లో॥ వేదమానా నిజభ్రాత్రా మాయేతి పరిశంకినీం
కాత్వం కల్యాణి భద్రంతే కేనైవ మవమానితా ॥

తా॥ ఆ కన్నట్టునదియు తన అన్న చేయు మాయయే యని అనుమానించి ఆమెతో ఓ కల్యాణీ! నీ వెవ్వతెవు? నీకు క్షేమమగుగాక? నీ వెవరిచే ఇట్లు అవమానింపబడితివి?

శ్లో॥ రోదనం కిన్ను సుశ్రోణి కిమర్థం విజనేస్థితా
సర్వంమేబ్రూహి మాభైషీః తరే స్త్వం దుఃఖసాగరమ్॥

తా॥ ఓ కాంతా ఎందుకేడ్చుచుంటివి ? ఈ విధముగా జనసంచారము లేనిచోట ఎందుకుంటివి? నీకు భయము వలదు. అన్ని విషయములు నాతో చెప్పుము, కష్టసముద్రమును దాటి బయటపడగలవు.

శ్లో॥ ఇతి సంలాలితానే దుర్దండీ వీత సాధ్వసా
వక్తుం ప్రచక్రమే సాధ్వీ స్వవృత్తాంతం యథాక్రమమ్

తా॥ అని హనుమంతునిచే ఓదార్చబడి భయము తొలగినదై సాధ్వియగు దుర్దండి తన వృత్తాంతమంతను యథాక్రమముగా చెప్పమొదలిడెను.

శ్లో॥ అత్ర మైరావణో నామ రాక్షసః పాపకృత్తమః
మాతులో రావణస్యాయం సాధూన్ద్వేష్టి సర్వదా ॥

తా॥ ఇచ్చట పాపాత్ములందు మొదటివాడగు మైరావణుడను రాక్షసుడు కలడు. ఆతడు రావణునకు మేనమామ. ఎల్లప్పుడును సజ్జనులను ద్వేషించువాడు.

శ్లో॥ తస్యాహం భగినీ దీనా దుర్దండీ నామ నామతః
పితాభూన్నీలమేఘస్య కాలదండ ఇతి శ్రుతః ॥

తా॥ అతని సోదరిని నేను. దుర్దండి అను పేరుగల దీనురాలను. నీలమేఘునకు తండ్రియగువాడు కాలదండుడను వాడు కలడు.

శ్లో॥ సర్వలక్షణ సంపన్నః సంతోషయతి సజ్జనాన్
కస్యచి ద్వరకాలస్య దేవర్షి ర్నారదోఽభ్యగాత్ ॥

తా॥ మంచిగుణముల నన్నిటినందియున్న ఆతడు సత్పురుషుల నానందింపజేయువాడు. ఒకానొక సమయమున ఆతని కడకు దేవర్షియగు నారదుడు వచ్చెను.

శ్లో॥ దదర్శ నీలమేఘం తం వినయావనతం శుభం
తదాబ్రోవాచ భగవాన్ నారదో జ్ఞానచక్షుషా ॥

తా॥ నారదుడు అప్పుడు వినయమున ముఖముదించుకొని శుభదర్శన మిచ్చిన నీలమేఘుని చూచెను. అంత నామహాశీయుడగు నారదుడు జ్ఞానదృష్టితో చూచి

శ్లో॥ దృష్ట్వా స్వభావిభవ్యంవై శృణ్వతాం సర్వరక్షసాం
అయం పాతాళలంకాయాః భవితాధిపతి స్స్వయమ్ ॥

తా॥ పూర్వాపరము లెరిగినవాడై రాక్షసులందరు వినుచుండగా ఈతడు పాతాళలంకకు రాజు కాగలడు' అనెను.

శ్లో॥ విభీషణ ఇవాన్యస్య దేవరాజో యథాదివః
చక్రాంకుశ పతాకాబ్జా యవమత్స్య యథాతథమ్॥

తా॥ స్వర్గమందలి ఇంద్రునిబోలి వి భీ ష ణు న కు మారుగ రాజగును. చక్రిము, అంకుశము, పతాక, అబ్జము, యవరేఖ, మత్స్యరేఖ మొదలగు-

శ్లో॥ విరాజంతే స్ఫుటారేఖాః పదయో శ్శుభసూచకాః
అత ఏవం మహాభాగం భావినం లోకనాయకమ్ ॥

తా॥ రేఖలు శుభసూచకములుగా పాదములందు

స్పష్టముగా కానవచ్చుచున్నవి. కావున ఇట్టి మహానుభావుని కాబోవు లోకనాయకునిగా

శ్లో॥ రక్షన్తు సర్వతస్సభ్యాః భవన్తో వీత మత్సరాః
ఇత్యాదిశ్య ముని శ్శ్రీమాన్ తత్క్షణా దంతరాత్కపే ।

తా॥ అన్ని విధముల కాపాడుకొనుడు. ఓ సభ్యులారా! మీరు పరస్పర మాత్సర్యములవీడి ఆతనిని రక్షించుచుండుడు. అని ఆదేశించి ఓ వానరేశా! వెంటనే ఆ దివ్య మునియగు నారదుడు వెడలెను.

శ్లో॥ తతో మైరావణః క్రుద్ధో నీలమేఘం శుభప్రదం
ఆసనాత్తూర్ణ ముత్థాయ మత్పుతం పాణినా గ్రహీత్ ॥

తా॥ పిమ్మట మైరావణుడు మిక్కిలి కోపగించి వెంటనే ఆసనమునుండి లేచి శుభప్రదుడు, నా కుమారుడు నగు నీలమేఘుని పట్టుకొనెను.

శ్లో॥ తత స్తంబహుభారాభ్యాం శృంఖలాభ్యా మయోజయత్
మామాహూయతతో భ్రాతా సుత గ్రహణదుఃఖితామ్॥

తా॥ పిమ్మట మిక్కిలి బరువుగల సంకెళ్ళతో అతనిని కట్టివైచెను. పుత్రుని బంధించుటవలన దుఃఖితనైన నన్ను కూడ నా అన్న పిలచి

శ్లో॥ అనేన నిగళేనాశు బంధయామాస నిర్దయః
తిష్ఠామిమాందశాం ప్రాప్తా మాతాపుత్రా వుభావపి ।

తా॥ దయాహీనుడై వెంటనే ఈ సంకెళ్ళతో నన్ను కూడ బంధించెను. ఇట్టి దశనంది తల్లి బిడ్డల మిర్వురము నుంటిమి.

శ్లో॥ సమ్మోచయితు మద్యాపి చిరకాలేన నేహ తే
తదా ప్రభృతి మాం పుత్రో న పశ్యతి కదాచన॥

తా॥ వీడుట కిప్పటికిని చిరకాలముగా నెవ్వరు లేరు. ఆనాటినుండియు నెన్నడు నన్ను నా కుమారుడు చూడలేదు.

శ్లో॥ అహం తాతం న పశ్యామి పృథక్కారాగృహేషితా
ఇదానీం మాముపాస్థాయ భ్రాతా మైరావణశ్శఠః॥

తా॥ నేను తండ్రిని కూడ చూడక ప్రత్యేకమగు కారాగృహమున నుంటిని. ఈరోజు శఠుడగు నా సోదరుడు మైరావణుడు సమీపించి

శ్లో॥ ఉవాచ సత్వరం వాక్యం మాయీ పరమ వంచకః
అయి దుర్గండి భద్రం తే మాభూత్తే మనసోవ్యథా॥

తా॥ మోసగాడు, మాయలమారియగు నాతడు వెంటనే ఇట్లనెను : ఓ దుర్దండీ! నీకు శుభముగుగాక! నీకు మానసిక బాధ కల్గకుండుగాక!

శ్లో॥ మహామార్యాస్తు దుర్గాయాః ఉత్సవ స్సప్రవర్తతే
తదిమౌ మానుష శ్రేష్ఠౌ రామలక్ష్మణ నామకౌ॥

తా॥ మహామారియగు దుర్గకు ఉత్సవము జరుగు

చున్నది. కాన రామలక్ష్మణులను పేరుగల ఈ మనుష్య శ్రేష్ఠులను

శ్లో॥ బలిం కరోమి దుర్గాయై స్నాపయే మానవోదకైః
హైమం గృహాణ కలశం ఆనవానసనవోదకమ్ ॥

తా॥ దుర్గకు బలియిచ్చుచున్నాను. వీరిద్దరను నూత్న జలములతో స్నానము చేయించుము. బంగారపు పాత్రను తీసికొనుము. శీఘ్రముగా నీటిని తెమ్ము.

శ్లో॥ ఏవ మాజ్ఞాపితా నేన గృహీత్వా హేమకుండికాం
నిగళప్రతిరోధాచ్చ చిరమాగాం సరస్తటమ్ ॥

తా॥ అని అతనిచే ఆజ్ఞాపింపబడినదాననై బంగారు పాత్రను తీసికొని ఈ సంకెళ్ళ కారణమున చాలా సేపటికి ఈ సరస్సునకు చేరితిని.

శ్లో॥ అహం తద్వశగౌ దృష్ట్వా రాఘవౌ శుభవిగ్రహౌ
స్మృత్వా చేమాం మమావస్థాం దుఃఖితాస్మి పునః పునః॥

తా॥ నేను అతనికి వశమైయున్న శుభప్రదములగు ఆకారములుకల రామలక్ష్మణులను చూచి ఈ నా స్థితిని తలచుకొని మరల మరల దుఃఖితురాలనగుచుంటిని.

శ్లో॥ మమాస్తు మందభాగ్యాయాః అనాథాయాశ్చ సర్వతః
ఘృణితాయాశ్చ దైవేన దుఃఖసాగర మజ్జనమ్ ॥

తా॥ మందభాగ్యురాలను. అన్ని విధముల అనాథను. దైవముచే వదలిపెట్టబడినదానను అగు నాకు ఈ దుఃఖసము ద్రమున మునుగగతిపట్టుగాక !



శ్లో॥ కథం రాఘవయో రద్య స్వయ మిన్ద్రప్రభావయోః
సంప్రాప్తా దురవస్థాసా సాహాయ్యేఽపి హనూమతః ॥

తా॥ సాక్షాత్తుగ ఇంద్రప్రభావము కల్గియుండు ఈ రామలక్ష్మణులకు హనుమత్సహాయము ఉండగనే ఎట్లు ఈ గతి కల్గినది ?



శ్లో॥ మయాశ్రుతో హనుమాన్వై తన్నారద ముఖాచ్చ్యుతః
దేవదానవదుర్ధర్షో మహాబలపరాక్రమః

తా॥ హనుమంతుడు దేవతలకు, రాక్షసులకును జయింపనలవికానివాడని, గొప్పబలపరాక్రమములుకలవాడని నారదునివలన వింటిని.



శ్లో॥ హనుమాన్క్వక్వవాయాతః క్వసుగ్రీవశ్చ జాంబవాన్ ॥

తా॥ హనుమంతు డెక్కడున్నాడు ? ఎక్కడకు వచ్చినాడు ? సుగ్రీవుడు, జాంబవంతుడును ఎక్కడున్నారు ?

శ్లో॥ ధ్రువం వినిశ్చిత్య దురంత మీదృశం
విచిన్వతీమం చరణం జగత్త్రయే
ప్రతీక్షమాణా హనుమత్పరాక్రమం
ప్రాణాన్బిభర్తి స్ఫుటితాసుమర్మసు ॥

తా॥ ఈ నా దేహము ఇట్టి కష్టములను నిశ్చయించు కొనియే హనుమంతుని పరాక్రమమును ఎదురుచూచుచు ఆ పాదములనే ముల్లోకములందు శరణ్యములుగా తలచుచు మర్మములు భేదింపబడుచుండ ప్రాణములను వహించుచున్నది.

శ్లో॥ అథాంఘ్రి పద్మద్వయ లగ్నమానసే
కపీశ్వరే జాగ్రతి భక్తశేఖరే
దశామిమాం రాఘవయోర్విలోక్య వా
స్వయం నిరాశాస్మి శరీరధారణే॥

తా॥ తమ పాదపద్మములయందే లగ్నమైయున్న మనస్సుకల భక్తశ్రేష్ఠుడు వానరవీరుడునగు హనుమంతుడు జాగరూకుడై యుండగనే రామలక్ష్మణులకిట్టి దుర్దశకలుగుట చూచి శరీరధారణమునందే నేను నిరాశనందిన దాననైతిని.

